# "ఆటలో ఆటగా నవ్వులో నవ్వుగా, సరిగ్గా చూసీ, ఆలోచించీ, టక్కున అంటించాలీ యింక, సరదాగా యిది చెయ్యాలింక" — ఫేవీ ఫెయిరీ





"ఇంద్రజాలం కానే కాదిది
చేత్తోచేసే తమాషా యిది
డబ్బూతోనూ పనియే లేదు
దీనికి యిక మరి తిరుగేలేదు."
"ఏమిటిదంతా యిటొచ్చి చెప్పు
ఏంచెయ్యాలో దబ్బున చెప్పు."
"రండర్రా యిటు రండర్రా
చెప్పేదేదో వినిపొండర్రా
ఆలోచించి అంటించింక
ఫెవికాల్ ఎమ్ ఆర్ తేవాలింక
ఏ బొమ్మయినా, ఏ బుట్టయినా
ఏ పర్సయినా చేసెయ్యొచ్చు
పట్టుకోకనే పట్టుకునేదిది
మురికి కానిది ముచ్చటైనది
సరదా సరదా తమాషాయిక
బొమ్మేదైనా చేసెయ్యింక"

గాజుల స్టాండు ఎలా తయారు చెయ్యడం అనే తీరుని ఉచితంగా పొందటం కోసం ఈ కూపన్ పంపించండి లేదా యీ చిరునామాకు వ్రాయండి : "ఫెవీ ఫెయిరీ" పోస్ట్ బాక్స్ 11084, బొంబాయి 400 020.

ఫెవికాల్® ఎమ్ ఆర్
సింథెటిక్ ఎడ్హెసివ్




బాగా పనిచేసేది, మరెంతో పేరున్నది ఫెవికాల్ ఎమ్‌ఆర్ అంటేనే అది

® ఇవి మరియు ఫెవికాల్ బ్రాండ్‌లు, యీ రెండూ పిడిలైట్ ఇండస్ట్రీస్ ప్రైవేట్ లిమిటెడ్, బొంబాయి 400 021 వారి రిజిష్టర్డ్ ట్రేడ్‌మార్క్‌లు గలవి.

ప్ర: "దీపాల పండుగ" ఏది?

జ : ....................................

ప్ర. ఏ రాష్ట్రంలో గణేష్ చతుర్థిని వైభవంగా జరుపుతారు?

జ : ....................................

ప్ర: "రంగుల పండుగ" ఏది?

జ : ....................................

ప్ర: ఏ రాష్ట్రంలో దుర్గాపూజ ఘనంగా జరుపుతారు?

జ : ....................................

ప్ర: కర్ణాటక రాష్ట్రంలోని ఏ నగరంలో దసారాని రాజవైభవంతోనూ, కోలాహలంగానూ జరుపుతారు?

జ : ....................................

ప్ర: ఈ క్రింది పంటల పండుగలని అవి జరిగే రాష్ట్రాలను జతచేయండి.

జ : 1. ఓనమ్ : కేరళ

2. బైసాకి : ..........................

3. పొంగల్ : ..........................

4. బిహు : ..........................

కేరళ, అస్సాం, తమిళనాడు, పంజాబ్, ఆంధ్రప్రదేశ్

పేరు ....................................

....................................

చిరునామా ....................................

....................................

....................................

పుట్టిన తేది ....................................




గూడు మధ్యలోకి గ్రుడ్డుని చేర్చడానికి మహారాజుకి దారి చూపండి.

గమనిక:

మీ గురించి తెలుసుకోడానికి మిఠాయిల మహారాజు ఎంతో ఇష్టపడుతున్నాడు, అతనికి రాయండి

The King of Sweets
P.B. No.2040
Madras 600 001

A CHANDAMAMA PUBLICATION

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [ "స్వామిద్రోహి-మిత్రద్రోహి" ]కి ఆధారం, ఎస్. శివనాగేశ్వరరావు రచన. విద్య నేర్వ దలచినవాడు, ఏదో ఒక గురువుదగ్గిరకంటూ వెళ్లడు. వారిలో ఎవరు సమర్థులు, అని విచారించిన తర్వాతే, శిష్యుడయేందుకు ప్రయత్నిస్తాడు. ఇది, గురువులైనవారికి కూడా వర్తిస్తుంది. వారూ, తమ దగ్గిర కొచ్చేవాళ్ళ అర్హతను పరీక్షిస్తారు. ఈ విషయం ''శిష్యార్హత'' అన్న కథలో వివరించబడింది.

## అమరవాణి

అశ్వః శస్త్రం శాస్త్రం వీణా, వాణీ నరశ్చ నారీచ,
పురుష విశేషం ప్రాప్తా, భవంతి యోగ్యా అయోగ్యాశ్చ.

[గుర్రమూ, ఆయుధమూ, శాస్త్రమూ, వీణా, వాక్కూ మొదలైన వాటి ఉపయోగమూ; స్త్రీ పురుషుల ప్రయోజనమూ వాటినీ, వాళ్లనూ ఉపయోగించే వారి శక్తి మీద ఆధారపడి ఉంటుంది.]

సంపుటి 82 జనవరి '88 సంచిక 1

విడి ప్రతి : 2-50 : : సంవత్సర చందా : 30-00

CHITRA

# చందమామ కబుర్లు



## మునిగిపోయిన ఓడ నుంచి నిధులు!

1912 వ సంవత్సరం ఏప్రిల్ 15 వేకువజామున, 2-20 గంటలకు అనాటి బ్రహ్మాండమైన ఓడ 'టిటానిక్', తొలి ప్రయాణంలో మునిగిపోయింది. ఆ ప్రమాదంలో 1,513 మంది ప్రాణాలు కోల్పోయారు. ఇటీవల కొందరు ఏడు వారాలపాటు పట్టుదలతో కృషిచేసి, అట్లాంటిక్ మహాసముద్రం అడుగు భాగంలో సురక్షితంగా ఉన్న, ఆ ఓడలోని వందలాది వస్తువులను ఫ్రెంచి తీరానికి చేర్చారు।

## ఖడ్గమృగం వర్ధిల్లాలి!

నానాటికి అంతరించిపోతూన్న ఖడ్గమృగజాతి సంతతిని పరిరక్షించాలని ప్రచారం చేస్తూ, జింబాబ్వేకు చెందిన డార్లీ హెవాట్, జూలీ ఎడ్వర్డ్స్ అనే ఇద్దరు అమ్మాయిలు లండన్ నుంచి హరారేకు సైకిలు మీద ప్రయాణం చేస్తున్నారు. నార్వే, స్వీడన్, డెన్మార్క్, పశ్చిమ జర్మనీ, నెదర్లాండ్స్, ఫ్రాన్స్, స్విట్జర్లాండ్, ఇటలీ, ఈజిప్టు మొదలైన దేశాలగుండా ప్రయాణం చేస్తూ, వసూలయ్యే ధనాన్ని, ఖడ్గమృగం పరిరక్షణనిధికిగాను వాళ్ళు — జింబాబ్వే నేషనల్ కన్సర్వేషన్ ట్రస్ట్‌కు ఇస్తారు.





## సూర్యుడిచుట్టూ రంగుల వలయం!

ఇటీవల దాదాపు రెండు గంటలసేపు, సూర్యుడి చుట్టూ ఇంద్రధనస్సు వంటి రంగుల వలయం ఏర్పడడం కనుగొనబడింది. ఇండూర్, హోల్కర్ సైన్స్ కాలేజీకి చెందిన ప్రొఫెసర్ రాంశ్రీవాత్సవ ఈ విషయాన్ని మొదట పసిగట్టాడు. భూమికి 15 కి.మీ. దూరంలోని మేఘాలలో ఉన్న మంచు బిందువుల గుండా, సూర్యకిరణాలు వక్రీకరణం చెందడంవల్ల ఈ రంగుల వలయం ఏర్పడుతుందని—300 ఏళ్ళక్రితం బ్రిటిష్ శాస్త్రవేత్తల పరిశోధనలు వెల్లడించాయి।

## తెలివిగల పిల్లలు

ఈ తరం పిల్లలు, అదే ప్రాయంలోని వాళ్ళ తాతలకన్నా, బామ్మలకన్నా, తెలివిగలవాళ్ళని, బ్రిటన్‌లో ఇటీవల జరిపిన ఒక పరిశోధనలో తెలియవచ్చింది. వెయ్యిమంది పదేళ్ళ బాలబాలికల తెలివితేటలను పరిశోధించిన ఒక మనస్తత్వవేత్త, ఆ ఫలితాలను, 1936 వ సంవత్సరం నాటి ఫలితాలతో పోల్చి చూడడంతో ఈ విషయం వెల్లడయింది.



పురాణగాథలు :

# కళావతి

కాశీరాజు కుమార్తె కళావతి, అపురూపసౌందర్యవతి; గుణవతి, పరమభక్తురాలు. బాలికగా ఉన్నప్పుడే దుర్వాసముని ఆమెకు పంచాక్షరీ మంత్రోపదేశం చేశాడు. ఆమె భక్తిశ్రద్ధలతో ఆ దివ్యమంత్రాన్ని జపిస్తూ, శివపూజ చేస్తూ వచ్చింది. యుక్తవయసు రాగానే మధురాధిపతి అయిన దాశార్హుడనే రాజు కళావతిని వివాహమాడాడు.

దాశార్హుడు మొదట మంచివాడుగానూ, సదాచార సంపన్నుడుగానూ ఉండేవాడు. కాని, అధికార గర్వం క్రమేణా అతని కన్ను గప్పింది. భోగలాలసుడయ్యాడు. పాపకృత్యాలకు పాల్పడ్డాడు. కళావతి ఈ విషయం గ్రహించి ఎంతో వేదన చెందింది. దాశార్హుడు సైతం, పరమభక్తురాలయిన తన భార్య కేసి తేరి పారచూడలేకపోయాడు.

కళావతి, భర్తను మంచి మార్గానికి తీసుకురావాలనుకున్నది. ఒకనాడతణ్ణి వెంటబెట్టుకుని గర్గముని ఆశ్రమానికి తీసుకువెళ్ళి, సంగతి విన్నవించింది. గర్గముని రాజును సమీపంలో ఉన్న కాళిందీ నదిలో స్నానం చేసి రమ్మన్నాడు. రాజు, ప్రశాంత ఆశ్రమ వాతావరణానికి ముగ్ధుడయ్యాడు. తన గత జీవితాన్ని తలుచుకుని పశ్చాత్తాపపడి, భక్తితో స్నానం చేశాడు. మరుక్షణమే అతని పాపాలన్నీ, కాకి రూపంలో ఎగిరిపోయాయి. తేలికపడ్డ నిర్మలమైన మనస్సుతో రాజు పైకి వచ్చి, ముని పాదాలకు నమస్కరించాడు. గర్గుడు అతనికి మంత్రోపదేశం చేశాడు. ఆ తరవాత రాజు రాజధానిని చేరి కళావతితో పవిత్ర జీవనం కొనసాగించాడు.





# రాజు-పండితుడు

చిత్రగిరి రాజ్యాన్ని పాలించే రాజులు, ఒక చిత్రమైన అచారాన్ని పాటించవలసి వచ్చేది. అదేమంటే—ప్రతి పది సంవత్సరాలకూ రాజు, అన్ని క్షత్రియ విద్యల్లోనూ స్వయంగా పోటీ చేసి, నెగ్గుకు రావాలి. అలా కాని పక్షంలో, రాజుపై ఎవరు గెలుస్తారో, వాళ్ళు చిత్రగిరికి రాజులయ్యేవారు.

ఈ అచారం ప్రకారం, చిత్రగిరిని పది సంవత్సరాలు పాలించిన రాజుకూ, ప్రజలలోనుంచి వచ్చిన మరి ముగ్గురు వీరులకూ మధ్య పోటీ జరిగింది. రాజు, వాళ్ళల్లో యిద్దరిని ఓడించగలిగాడు కాని, మూడవవాడైన మునెయ్య చేతిలో ఓడిపోయాడు. గెలిచిన మునెయ్య, మునీంద్రవర్మ అన్న పేరుతో, రాజయ్యాడు.

చిత్రగిరి రాజాస్థానంలో, ఉద్దండ భట్టు అనే ఆయన ప్రధానపండితుడు. ఆయన ఎంత గొప్ప పండితుడో, అంత ముక్కోపి కూడా. అవతలివాడు ఎంత గొప్పవాడయినప్పటికీ తలవంచని తత్వం ఉద్దండపండితుడిది.

మునీంద్రవర్మ సభ తీర్చిన మొదటి రోజున, ఉద్దండభట్టు సాంప్రదాయ బద్ధంగా, ''రాజా, బలంలో నువ్వు బలరాముడివి; సాహసంలో అభిమన్యుడివి; యుద్ధంలో అర్జునుడివి. అందువల్లనే, రాజ్యలక్ష్మి నిన్ను వరించింది!'' అన్నాడు.

ఇది విన్న మునీంద్రవర్మ, ఉద్దండ భట్టుకేసి ఒకటి, రెండు క్షణాలు తేరిపార చూసి, పెద్ద పెట్టున నవ్వసాగాడు.

''ప్రభువులవారు మన్నించాలి. తమ నవ్వుకు గల కారణం ఏమిటో సెలవిస్తారా?'' అని అడిగాడు ఉద్దండభట్టు.

''చెబుతాను. కాని, ముందుగా మీ గురించి కొంత వివరం కావాలి. అస్థాన పండితుడు కావడానికి, మీరు చేసిన కృషి

మల్లవరపు మనోహరరెడ్డి



సభాముఖంగా చెబితే వింటాం,'' అన్నాడు మునీంద్రవర్మ.

ఉద్దండభట్టు, తాను ఆస్థాన పండితు డయేందుకు పడిన శ్రమా, చేసిన కృషీ గురించి యిలా చెప్పాడు: ''రాజా, నేను పండిత వంశంలో పుట్టినవాడిని. నా తండ్రి గారికి మంచి పండితుడన్న పేరుండేది. ఆయన, నన్ను నృసింహశాస్త్రి అనే గురువుదగ్గిరకు విద్యాభ్యాసానికి పంపాడు. ఈయన మహామేధావే కాక; గొప్ప జ్ఞాని కూడా. నా గురువు దృష్టిలో, లోకంలో అందరికన్న పండితుడే గొప్పవాడు. చిన్న వయసులోనే ఎన్నో శ్రమలకోర్చి. ఆయనకు శుశ్రూషలు చేశాను. అడవినుంచి కంద మూలాలూ, ఫలపుష్పాలూ, దర్భలూ తీసుకువచ్చేవాడిని. ఎన్నో సందర్భాలలో ఆయన ఆగ్రహానికి గురై, చివాట్లూ, దెబ్బలూ తిన్నాను. నృసింహశాస్త్రిగారివద్ద వేదాలూ, ఉపనిషత్తులతోపాటు, మరెన్నో ఉద్గ్రంథాలు చదివాను. తర్కం, వేదాంతంలాంటి విద్యలు బోధించి, ఆయన నా మేధస్సును సానబట్టిన వజ్రంలా ప్రకాశింపచేశాడు. గురుకులంనుంచి ఇరవైఏళ్ళ అనంతరం బయటికి వచ్చాను. నా విద్యాపాటవం ప్రదర్శించి, చిత్రగిరి రాజుచేత సన్మానం పొంది, ఆయన కోరగా ఆస్థానపండితుడి నయ్యాను.''

ఉద్దండభట్టు చెప్పినది విని, రాజు మునీంద్రవర్మ, ''పండితుడు కావడానికి మీరు ఇరవైఏళ్ళపాటుపడిన శ్రమగురించి వింటూంటే, జాలీ, నవ్వూకూడా వస్తున్నది. నేను రాజు కావడానికి మూడేండ్లపాటు మాత్రమే శ్రమించాను. కాని, ఇరవైఏళ్ళ కృషితో పండితులైన మీరు, మూడేండ్ల శ్రమతో రాజునైన నా ఎదట నిలబడి, నా మెప్పుకోసం పొగడ్తలతో అతివినయం ప్రదర్శిస్తున్నారు. ఇది నవ్వు పుట్టించేది కాక, మరేమిటి? నా కథవింటే, మీకు ఆశ్చర్యం కలుగుతుంది,'' అన్నాడు.

తర్వాత మునీంద్రవర్మ, తన కథ యిలా చెప్పాడు: ''నేను రజకకులంలో

పుట్టాను. అతి బాల్యంనుంచీ పనుల్లో తల్లిదండ్రులకు సాయం చేస్తూండేవాడిని. అయితే, నాకు మరేదైనా మంచి వృత్తి నేర్చుకోవాలన్న కోరిక వుండేది. ఆ దశలో గ్రామానికి, క్షత్రియ విద్యల్లో ఆరితేరిన మల్లుడొకడు వచ్చాడు. ఆయన గ్రామాలన్నీ తిరుగుతూ, యుద్ధ విద్యల్లో అందరినీ ఓడిస్తూ, మా గ్రామం చేరాడు. ఖడ్గ విద్యలో కొద్దిపాటి ప్రవేశమున్న ఇద్దరు, ముగ్గురు గ్రామస్థులు మల్లుడితో తలపడి చిత్తుగా ఓడిపోయారు. ఆ పోటీలో మల్లుడి నైపుణ్యాన్ని గమనించిన నాకు, ఆయనకు శిష్యుణ్ణయి, అంతవాణ్ణి కావాలన్న కోర్కె కలిగింది. ఆ మర్నాడు ఆయనను కలుసుకున్నాను. మల్లుడు నన్ను శిష్యుడిగా చేర్చుకున్నాడు. మూడేళ్ళపాటు, మల్లుడితో తిరుగుతూ, అయననుంచి క్షత్రియ విద్యలన్నీ నేర్చుకుని, గురువంతటివాడినయ్యాను. తర్వాత, యిక్కడి పోటీలలో పాల్గొని, రాజునయ్యాను.''

మునీంద్రవర్మ, తన కథ చెప్పి, ''ఇంత అవలీలగా రాజునైన నాకు, యిప్పుడు, సువిశాలమైనచిత్రగిరి రాజ్యం, ఈసంపదా, ఈ మందీమార్బలం—అన్నీ హక్కుభుక్తమేకదా! రాకీస సాధనతో పండితులైన మీరు, కేవలం నా కనుసన్నలలో బతకవలసినవారేకదా? ఇప్పుడు చెప్పండి,



రాజు గొప్పా? పండితుడు గొప్పా?'' అని, ఉద్దండభట్టును ప్రశ్నించాడు.

ఆ ప్రశ్నకు ఉద్దండభట్టు నవ్వి, ''రాజా, వర్తమానకాలంలో, గతం గురించి తెలిసేది, మా కారణంగానే. తిథి, వార, నక్షత్రాలతో కాలాన్ని శాసించేది మేమే. మా మేధస్సు అపారం. అది వయసు పెరుగుతున్నకొద్దీ పదునెక్కుతుంది. మీరు నేర్చిన క్షాత్ర విద్యలు వయసు పైబడుతున్నకొద్దీ నిరుపయోగమై పోతాయి. రాజ్యం వీరభోజ్యం గనక, ఈ రాజ్యం మీరు వీరుడుగా వున్నంతవరకే; తర్వాత అన్యాక్రాంతమై పోతుంది. పండితులు, మీముందు చేతులు కట్టుకుని,



తలలువంచి ప్రదర్శించే వినయం, మీ అభిమానం పొందేందుకుకాదు; అది విద్యాగంధంవల్ల అబ్బిన సుగుణం మాత్రమే. ఇప్పుడు చెప్పండి; పండితుడు, మీకన్న గొప్పవాడుకాదా?'' అని అడిగాడు.

అందుకు మునీంద్రవర్మ, ''మీరు చెప్పేది, నాకు బోధపడడంలేదు. నాకు తెలిసినదల్లా, ఎంత పండితుడైనా, సిరిగలవాడి ముందు చేతులు కట్టుకుని నిలబడవలసిందే తప్ప, సిరిగలవాడు, పండితుడి ఎదట చేతులు కట్టుకుని నిలబడవలసిన సందర్భంరాదు.'' అన్నాడు.

ఉద్దండభట్టు చిరుకోపంతో, ''మీరు పొరబడుతున్నారు. అటువంటి సందర్భం కూడా తప్పక వస్తుంది. పండితుడు ఏనాడూ రాజుకన్న గొప్పవాడే!'' అన్నాడు.

''ఒట్టి మాటలు చాలవు. మీరనేదానికి రుజువు కావాలి. రాజుకన్న, పండితుడు గొప్పవాడని, మీరు నిరూపించగలిగితే— మిమ్మల్ని ఘనంగా సన్మానించి, బంగారు పళ్ళెంలో కాళ్ళుకడిగి, గండపెండేరం తొడుగుతాను. అంతేకాక, మిమ్ములను పల్లకీలో ఎక్కించుకుని, నగరవీధుల్లో మోస్తాను. అలాకాక, పండితుడి గొప్పతనం రుజువుచేయలేకపోతే, ఇకనుంచి చిత్రగిరి ఆస్థానంలో పండితుడి పదవి వుండదు. ఇదంతా ఒకనెలరోజుల్లో జరిగిపోవాలి. అంతవరకూ, మిమ్ములను సభనుంచి బహిష్కరిస్తున్నాను,'' అన్నాడు మునీంద్రవర్మ కోపంగా.

ఉద్దండభట్టు సభాబహిష్కరణ పొంది, ఇంటికి తిరిగివచ్చాడు. ఆయన ఎంత ఆలోచించినా, రాజుపై పండితుడి ఆధిక్యత నిరూపించడం ఎలాగో బోధపడలేదు. సామంతుడిపై, రాజు అధిక్యతా, బలహీనుడిపై, బలవంతుడి అధిక్యతా, పేదవాడిపై, ధనవంతుడి అధిక్యతా నిరూపించడం చాలా సులభం!

ఇలాంటి తరుణంలో, కళింగదేశం నుంచి విమలవాచస్పతి అనే పండితుడు, మునీంద్రవర్మ ఆస్థానానికివచ్చి, ఆయనతో,

''రాజా, నేను, మీ శత్రుదేశమైన కళింగ నుంచి వచ్చాను. నేను దేశదేశాలు తిరిగి, ఎందరో పండితులను ఓడించాను. మీ ఆస్థానంలో, ఎవరైనా నన్ను ఓడించ గలిగితే సరి, లేకుంటే చిత్రగిరిని, మా రాజుపరం చేయవలసి వుంటుంది. కాదు కూడదంటే, మా రాజు అపారమైన సైనిక బలంతో వచ్చి, మీ రాజ్యాన్ని ఆక్రమించ గలనని హెచ్చరించమన్నాడు. ఒకవేళ, మీ పండితులలో ఎవరైనా నన్ను ఓడించ గలిగితే, సరిహద్దుల్లో వున్న, మా దేశపు యాభై గ్రామాలను, మీరు మీ రాజ్యంలో కలుపుకోవచ్చు!'' అన్నాడు.

మునీంద్రవర్మ, తన ఆస్థానంలో వున్న నలుగురైదుగురు పండితులను, విమల వాచస్పతితో వాదించవలసిందిగా ఆదేశించాడు. కాని, వాళ్ళు వాచస్పతి చేతిలో చిత్తుగా ఓడిపోయారు.

అప్పుడు మునీంద్రవర్మ, మంత్రులతో మంతనాలు జరిపాడు. వాళ్ళు ఏక కంఠంగా, ''రాజా, ఉద్దండభట్టు తప్ప, యీ కళింగపండితుణ్ణి మరెవరూ ఓడించ లేరు,'' అని చెప్పారు.

రాజు, ఉద్దండభట్టుకు కబురు చేశాడు. ఆయన వచ్చి, కళింగ పండితుడితో వాదనకు ఉపక్రమించాడు. సభికులతో పాటు, రాజు కూడా మంత్ర ముగ్ధుడిలా, ఆ వాగ్యుద్ధాన్ని తిలకించసాగాడు.

కొంతసేపటికి, ఉద్దండభట్టు చేతిలో, కళింగపండితుడు ఓడిపోయి, తలదించు కున్నాడు.

మునీంద్రవర్మ పరమానందంతో, సింహాసనం దిగివచ్చి, ఉద్దండభట్టు కాళ్ళు కడిగి, గండపెండేరం తొడిగి, ''అజ్ఞానం కొద్దీ, మిమ్ములను కించపరిచినందుకు విచారిస్తున్నాను. ఐశ్వర్యం, రాజరికం గొప్పవనుకుని, నిజమైన విద్వత్తును చులకనచేసినందుకు, యీ సంఘటనతో, నాకు కనువిప్పు కలిగింది!'' అని, ఉద్దండభట్టును పల్లకీలో ఎక్కించి, బోయీలతోపాటు నగరవీధుల్లో మోసి, విద్యకూ, పాండిత్యానికీ పెద్దపీట వేశాడు.





# శిష్యార్హత

ఉజ్జయినీ నగరానికి సమీపంలో గల, ఒక పర్వత ప్రాంతంలో, ప్రజ్ఞాసాగరు డనే మహాపండితుడి ఆశ్రమం వుండేది. ఆయన వేదవేదాంగాలూ, ఉపనిషత్తులే కాక, శాస్త్రాలన్నీ క్షుణ్ణంగా అధ్యయనం చేసినవాడు.

ప్రజ్ఞాసాగరుడి దగ్గిర శిష్యరికం చేసి, సర్వవిద్యలూ అభ్యసించాలని ఎందరో వస్తూండేవాళ్ళు. అలాంటివారికి, ప్రజ్ఞా సాగరుడు, ఆశ్రమంలో ఒకపక్కగా వున్న రాతినేలను చూపించి, అక్కడ బావిని తవ్వగలవారికే, తన దగ్గిర శిష్యుడుగా చేరే అవకాశం వుంటుందని చెప్పేవాడు.

ఈ విచిత్రమైన నియమం, ఆయన ఎందుకు పెడుతున్నాడో, ఎవరికీ అర్థ మయేదికాదు. రాతినేలలో బావినితవ్వడం వెర్రిపని అని, కొందరు మొదట్లో నే విరమించుకుని వెళ్ళిపోయేవారు. మరి కొందరు, కొంత ప్రయత్నం చేసి మాను కునేవారు.

ఒకసారి, గౌరాంగు డనే పండితుడు దేశాటన చేస్తూ, ప్రజ్ఞాసాగరుణ్ణి గురించి విన్నాడు. ఆయన, ప్రజ్ఞాసాగరుణ్ణి దర్శించి, తనను శిష్యుడుగా చేసుకోమని కోరాడు. గౌరాంగుడి వెంట, ఆయన శిష్యుడు విద్యానిధి కూడా వున్నాడు.

యథాప్రకారం, ప్రజ్ఞాసాగరుడు, తనకు శిష్యుడుగా వుండదలచినవాడు, రాతి నేలలో బావి తవ్వవలసి వుంటుందని చెప్పాడు.

అది విని గౌరాంగుడు ఆశ్చర్యపోయి, "నేను తక్షశిల, నలందలలో శాస్త్రా ధ్యయనం చేసి, అక్కడ కొంతకాలం ఆచార్యుడుగా కూడా వున్నవాడిని. నా శిష్యులమని చెప్పుకుంటున్న పండితు లెందరో, దేశం నలుమూలలా గొప్ప

జొన్నలగడ్డ రత్న

పండితులుగా చెలామణీ అవుతున్నారు. అయినా, తమవంటి మహాపండితుడికి శిష్యుణ్ణి అనిపించుకోవాలన్నది, నా కోరిక. ఇప్పటికే, నాకున్న అర్హతలు అందుకు సరిపడగలవనుకుంటాను,'' అన్నాడు.

ప్రజ్ఞాసాగరుడు నవ్వి, ''నాకు శిష్యుడు కాదలచినవాడు, విధిగా రాతినేలలో బావిని తవ్వవలసిందే!'' అన్నాడు.

గౌరాంగుడు చిన్నబుచ్చుకుని, ''మీ విజ్ఞానాన్ని శిష్యులకు పంచిపెడితే, వారిలో ఏ ఒక్కరైనా మిమ్ములను మించి పోగలరన్న భీతి, మీకున్నట్టున్నది. రాతినేలలో బావిని తవ్వడం అసాధ్యం కాకపోయినా, అంత కష్టమైన పనిని నెత్తిన వేసుకుని, మీ శిష్యరికం సంపాయించడంవల్ల, నాకు కలగబోయే ప్రయోజనం ఏముంటుంది?'' అంటూ బయలుదేరబోయాడు.

అప్పుడు, ఆయన శిష్యుడు విద్యానిధి, గురువుతో, ''గురుదేవా, నన్ను అపార్థం చేసుకోకండి. ప్రజ్ఞాసాగరులవారి ఉద్దేశం, మనం రాతినేలలో నిజంగానే ఒక బావిని తవ్వి, చూపించమని అయివుండదు. వారి మాటలవెనక గొప్ప ఆంతర్యం వున్నదని, నా అభిప్రాయం,'' అన్నాడు.

గౌరాంగుడు విసుక్కుని, ''అలాగా! నాకు కూడా అర్థం కాని, ఆ ఆంతర్యమేదో, వివరించి చెప్పు,'' అన్నాడు.



''ప్రజ్ఞాసాగరులు, వారివద్ద వున్న గొప్ప విద్యాసంపదను సొంతం చేసుకోవడానికి కావలసిన సహనం, పట్టుదల, ఉత్సాహం—తన శిష్యరికం కోరి వచ్చేవారివద్ద వున్నదా లేదా, అని తెలుసుకోవడానికే, రాతినేలలో బావిని తవ్వాలనే నియమం పెట్టారు,'' అన్నాడు విద్యానిధి.

విద్యానిధి యిలా అనగానే, ప్రజ్ఞాసాగరుడు అతణ్ణి దగ్గరకు పిలిచి, ''తవ్వి చూపించకుండానే, నువ్వు రాతినేలలో అవలీలగా బావులు తవ్వగల సామర్థ్యం వున్నవాడివని, నాకు తెలిసిపోయింది. నీలాంటి శిష్యుడి కోసమే, నేనింతకాలంగా ఎదురు చూస్తున్నది,'' అన్నాడు.

ఆ మాటలకు, గౌరాంగుడు ఆశ్చర్య పోయి చూస్తూండగా, ప్రజ్ఞాసాగరుడు ఆయనతో, "నేను స్వార్థబుద్ధికొద్దీ, యితరులకు, నేను సంపాయించిన పాండిత్యాన్ని పంచిపెట్టడానికి సంకోచిస్తున్నట్టు, ఎందరో అపోహపడుతూ వచ్చారు. నిజానికి, నా అన్వేషణ అంతా, నన్ను మించిన మరొకరిని తయారు చేయడానికే!" అన్నాడు.

"క్షమించండి! అలాంటి అపోహ నాకూ వున్నది," అన్నాడు గౌరాంగుడు.

ప్రజ్ఞాసాగరుడు చిన్నగా నవ్వి, "నాకు శిష్యుడైనవాడు, నేను బోధించేది విని పూరుకునేవాడు గాక, నన్ను శోధించి— అవసరం అయితే వేధించి, నాకు తెలిసినదంతా బయటపెట్టించేవాడుగా వుండాలి. అందువల్లనే, నాకు శిష్యులవుదామని వచ్చినవారందరికీ, రాతి నేలలో బావి తవ్వమని చెప్పాను. దీని వెనక వున్న అంతరార్థం ఎవరికీ అర్థం కాలేదు," అన్నాడు.

"నా శిష్యుడు విద్యానిధి, అర్థం చేసుకోగలిగాడు. వాడు నన్ను మించిన పండితుడు," అన్నాడు గౌరాంగుడు ఎంతో సంతోషంగా.

ప్రజ్ఞాసాగరుడు తల వూపి, "రాతి పొరల్లో దాగివున్న జలధారల్ని వెలికి తీయడానికి ఎంత శ్రమ పడవలసి వుంటుందో, అందరికీ తెలిసిన సంగతే. అలాగే, ఒక గురువు మేధస్సులో సంక్షిప్తమైన విజ్ఞానాన్ని తరచిచూడడానికి కూడా చాలా శ్రమపడవలసి వుంటుంది. ఆ ప్రయాసపడవలసింది శిష్యుడు గాని; గురువు కాదు. జ్ఞానబోధ చేసే గురువుకే గాక, ఆ జ్ఞానాన్ని ఆర్జించాలనుకునే శిష్యులకు కూడా, కొన్ని అర్హతలుండాలని చెప్పేందుకే, యిదంతా చేయవలసి వచ్చింది. విద్యానిధి, పేరు నిలబెట్టగలడన్న నమ్మకం, నాకున్నది!" అన్నాడు.

గౌరాంగుడు ప్రజ్ఞాసాగరుడికి విద్యానిధిని అప్పగించి, వెళ్ళిపోయాడు. విద్యానిధి, ప్రజ్ఞాసాగరుడి వద్ద, ఎన్నో ఏళ్ళు శిష్యరికం కొనసాగించి, గురువును మించిన శిష్యుడుగా కీర్తి సంపాయించాడు.






3

[అరణ్యంలో పురాతన శిథిలాల మధ్య, వినోదుడు ఒక బంగారు స్త్రీ విగ్రహం చూశాడు. జలపాతానికి వెనక ఉన్న గుహలో ప్రవేశించి, దాని రహస్యం తెలుసుకోమని ఒక కంఠస్వరం అతణ్ణి హెచ్చరించింది. విగ్రహానికి రక్షణ ఏర్పాటు చేయడానికి, వినోదుడు రాజును వెంట బెట్టుకుని వచ్చాడు. దాన్ని చూసి, రాజూ, మహాజ్ఞానులూ అమితాశ్చర్యం చెందారు.—తరవాత]

బంగారు విగ్రహం కళ్ళబడగానే రాజూ, ఉద్యోగులూ సౌందర్యవంతులుగా మారి పోయారు. అప్పుడు వినోదుడు, రాజుతో, "తమ ఉద్యోగులు కూడా క్షణాల మీద ఎంత చూడ చక్కనివాళ్ళయ్యారు, ఆశ్చర్యం!" అన్నాడు.

రాజు, వాళ్ళ కేసి గుచ్చి చూస్తూ, "ప్రాణం రాగానే, ఆ అందాలరాశిని పెళ్ళాడబోయేది, నేను! వీళ్ళు అందగాళ్ళలా కనబడాలని చూడడం, వృథా శ్రమ," అన్నాడు.

"అలాగే, పెళ్ళాడండి, చండమార్తాండ మహారాజా!" అన్నాడు వినోదుడు చిన్నగా నవ్వుతూ.

"ఎంత అమాయకుడివిరా, నువ్వు! ఆ విగ్రహానికి ప్రాణం ఎందుకొస్తుందనుకున్నావు? నేను వివాహమాడేందుకే కదా," అన్నాడు రాజు.

మనోజ్ దాస్



"నా అమాయకత్వానికి సిగ్గుపడుతున్నాను, మహారాజా," అన్నాడు వినోదుడు.

రాజు పెద్దగా నవ్వి, "మరి సిగ్గుపడకేం చేస్తావు! కొన్ని నిగూఢవిషయాలు, ఎంతో తెలివిమంతుడైన, నాబోటి రాజుకే అవగతం కాగలవు," అన్నాడు.

"మీరంత తెలివిగలవాళ్ళు కాదేమో అన్న అనుమానం కలుగుతున్నది, మహారాజా!" అన్నాడు వినోదుడు.

"తెలివిగలవాణ్ణి కాదా? ఏమన్నావు నువ్వు!" అంటూ రాజు మీసం మెలివేశాడు.

వినోదుడు కొంచెంసేపు మౌనంగా వుండి, "మహారాజా, మీరూ, మీ ఉద్యోగులూ కూడా, ఆ విగ్రహం అందచందాలు చూసి అద్భుతపడుతున్నప్పుడు, నిజంగానే సౌందర్యవంతులుగా కనిపించారు. కాని, మీరు అహం కొద్దీ, ప్రాణం రాగానే, ఆ విగ్రహకాంతను వివాహం అడతానన్న క్షణంలో, తిరిగి పూర్వం అంత అనాకారిగా మారిపోయారు— మీ ఉద్యోగులతో సహా," అన్నాడు.

"ఎంత పొగరు! నన్ను అనాకారి అంటావా?" అంటూ రాజు గుప్పెట్లు బిగించాడు కోపంగా.

"మేమూ అనాకారివాళ్ళమా?" అంటూ హుంకరించారు మహాజ్ఞానులు పట్టరాని ఆగ్రహంతో.

వాళ్ళందరూ తిరిగి వినోదుణ్ణి పట్టుకునేందుకు, ముందుకు దూకారు. అయితే, వినోదుడు వాళ్ళకు దొరక్కుండా బండరాళ్ళమీదినుంచి ఎగిరిదూకుతూ, జలపాతంకేసి పరిగెత్తసాగాడు.

రాజూ, ఆయన ఉద్యోగులూ, యిద్దరిద్దరుగా ఒకళ్ళచేతులొకళ్ళు పట్టుకుని, బండరాళ్ళమీదినుంచి గెంతుతూ వినోదుడి వెంటబడ్డారు. అయితే, వాళ్ళకు యిలాంటి దేహశ్రమ అలవాటు లేదు గనక, కొద్ది సేపట్లోనే అలసిపోయి, రాళ్ళ మీది నుంచి జారి కిందపడి, శరీరాలు హూనం చేసుకున్నారు.



ఈ లోపల వినోదుడు జలపాతం ముందుకుపోయి నిలబడ్డాడు. రాజు పెద్దగా రొప్పుతూ, "ఒరే, కుర్రకుంకా! ఆ జలపాతంలో ప్రవేశించకు, చాలా ప్రమాదం," అని కేకవేశాడు.

"ఓయ్ం, చండమార్తాండరాజా! ఈ జలపాతం, దాని చాటున వున్న గుహ— అది దాటిపోతే వచ్చే ప్రదేశం ఎంత ప్రమాదకరమైనదో తెలీదు. కాని, వాటన్నిటికన్న, నీ రాజ్యంలో వుండడం మహాప్రమాదం!" అంటూ వినోదుడు జలపాతంకేసి ఒక్కొక్క అడుగు వేయ సాగాడు.

రాజూ, మహాజ్ఞానులూ నిశ్చేష్టులై, అతడి కేసి చూడసాగారు. వినోదుడు జలపాతం ప్రవేశించబోతూ, పెద్ద గొంతుతో, "నేను, యీ జలపాతందాటి, అవతలివైపుకుపోబోతున్నాను!" అన్నాడు.

రాజు రెండు చేతులూ పైకెత్తి ఊపుతూ, "ఒరే, ఆ జలపాతం దాటిపోయిన వాళ్ళెవరూ తిరిగిరాలేదు, జాగ్రత్త!" అంటూ కేకపెట్టాడు.

"ఆ వెళ్ళినవాళ్ళు తిరిగిరావడం యిష్టంలేకో, లేక తిరిగివచ్చే శక్తిలేకో— అలా జరిగివుంటుంది. కాని, నేను మాత్రం, ఆ బంగారు విగ్రహానికి ప్రాణం వచ్చే రహస్యం తెలుసుకుని తిరిగివస్తాను. మహారాజా, అప్పటివరకూ, ఆ విగ్రహ రక్షణ బాధ్యత తమది!" అన్నాడు.

వినోదుడు అన్న యీ మాటలు, అక్కడి కొండగుహల్లో, చుట్టూ వున్న అరణ్యంలో ప్రతిధ్వనించినై. రాజు నిర్వైరపాటుతో శిలాప్రతిమలా నిలబడిపోయాడు.

తర్వాత, అతడు అప్పుడే స్పృహ వచ్చినవాడిలా చేయి పైకెత్తి, "ఒరే, నువ్వేమీ దిగులుపెట్టుకోకు. ఆ బంగారు విగ్రహాన్ని పంచదారలడ్డూకన్నా—కాదు పంచదారలడ్డులగుండిగ కన్న ఎక్కువ జాగ్రత్తగా కాపాడతాను. ఎవడైనా, ఆ విగ్రహాన్ని తాకాడో, వాడి తల కోటకొమ్ముకు వేలాడ వలసిందే. నువ్వు మాత్రం, ఆ



వాయువేగంతో ముందుకు దూసుకుపో తున్నట్టు అతడి కనిపించింది.

కొంతసేపటికి వినోదుడు జలపాతం ఆవలి వైపుకు చేరుకున్నాడు. కొండల మయమైన బంగారులోయ రాజ్యం వంటి ప్రదేశమే అతనికి కనిపించింది. సూర్య కిరణాలు కూడా చొరలేనంత దట్టంగా, ఆ ప్రాంతమంతా చెట్లమయంగా ఉన్నది.

వినోదుడు దాపులనున్న ఒక చిన్న కొండను ఎక్కి, అవతలివైపుకు చూశాడు. చిన్న నదితో చుట్టబడిన విశాలమైన మైదానం అతని కంటబడింది.

''ఎవరా కుర్రవాడు?'' అన్న కంఠ స్వరం విని, వినోదుడు వెనకకు తిరిగి చూశాడు. పక్కనే ఉన్న మరొక చిన్న కొండమీదినుంచి గూనిముసలివాడొకడు, అతనికేసి వస్తున్నాడు. వాడికి పొడవైన గడ్డం ఉన్నది. వాడి కళ్ళు పాముకళ్ళలా మెరుస్తున్నవి.

వాడు, వినోదుణ్ణి సమీపిస్తూ, ''ఎవరు నువ్వు? ఇక్కడ ఏం చేస్తున్నావు?'' అని అడిగాడు.

''నా పేరు వినోదుడు. ఇక్కడ ఏమీ చేయడంలేదు. అవును, నువ్వెవరు?'' అన్నాడు వినోదుడు.

''నువ్వు మాట్లాడే ధోరణి, నాకు నచ్చ లేదు. నేను, ఈ జ్ఞానభూమి ద్వార

రహస్యం తెలుసుకుని త్వరగా తిరిగిరా. నీకు నా రాజ్యంలో ఏదో ఒక మూల యింత ముక్క కట్టబెడతాను. అంతేకాదు—నా కుమార్తెల్లో ఒకరిని, అందచందాల్లో నాతో సరితూగగల ఆవిణ్ణి, నీకిచ్చి వివాహం చేస్తాను,'' అన్నాడు బిగ్గరగా.

అయితే, రాజు చెప్పినదంతా, వినోదుడి చెవిన పడిందోలేదో చెప్పడం కష్టం. అతడు భీతికొల్పే ధ్వనులతో, అంత ఎత్తునుంచి కిందికి ఉరకలువేస్తూ దూకుతున్న జల పాతపు నీటిలోకి ధైర్యంగా ప్రవేశించాడు.

జలపాతం దాటడానికి ఎంత సేపు పట్టిందో వినోదుడికి తెలియలేదు. ఒకొక్కక్క అడుగు వేస్తున్నప్పుడల్లా, తాను



నీ ఇష్టానుసారం ఎక్కడికయినా వెళ్ళ వచ్చు." అన్నాడు గూనివాడు.

త్వరగా గూనివాణ్ణి వదిలించుకోవచ్చు అన్న ఆనందంతో వినోదుడు నదిలోకి దూకాడు. నదిలో నీళ్ళు వెచ్చగా ఉన్నాయి. అతడు ఈదుతూ నదినిదాటి, ఆవలి గట్టున ఉన్న తుప్పను పట్టుకుని పైకి ఎక్కాడు. తనకు ఎదురుగా గూని ముసలివాడు నిలబడి ఉండడం చూసి, వినోదుడు అమితాశ్చర్యం చెందాడు.

"నువ్వు నది దాటడం నేను చూడ లేదు. ఇక్కడికెలా వచ్చావు?" అని అడిగాడు వినోదుడు గూనివాణ్ణి.

"ఆ గట్టున మాయమై, ఇవతలి గట్టును చేరుకున్నాను," అన్నాడు గూనివాడు.

"అది సాధ్యమా?" అన్నాడు వినో దుడు ఆశ్చర్యంతో.

"సాధ్యమే! ఎందుకంటే వాస్తవానికి మనం అందరమూ శక్తితరంగాలమే. మనకు తగిన జ్ఞానం ఉన్నట్టయితే, కావాలనుకున్నప్పుడు శక్తితరంగాలు గానూ, ఆ తరవాత మనుషులుగానూ, మారుతూవుండవచ్చు." అన్నాడు గూని వాడు.

"అలాగా!" అన్నాడు వినోదుడు.

"నీకు ముందే చెప్పాను కదా, నువ్వు జ్ఞానభూమిని చేరుకున్నావని. అయినా రక్షకుణ్ణి, పూజారిని. ఈ క్షణంలో నువ్వేమీ చేయకుండా ఉండవచ్చు. కాని, మునుముందు ఏమి చేయాలను కుంటున్నావు?" అని ప్రశ్నించాడు గూని వాడు.

"నేను చాలా దూరం వెళ్ళాలి. అయితే, నేను చేరవలసిన ప్రదేశం ఎక్కడ ఉన్నదో, దానికి దారి ఎటు ఉన్నదో మాత్రం సరిగా నాకు ఇప్పుడు తెలియదు. బహుశా ఈ ప్రాంతంగుండానే వెళ్ళాలనుకుంటాను," అన్నాడు వినో దుడు నెమ్మదిగా.

"అలాగా! అయితే ఈ నదిలో దిగి, ఈదుతూ అవతలిగట్టు చేరుకో. ఆ పిమ్మట

నేను చెప్పిన ఈ జ్ఞానశక్తి కొందరికే పరిమితం," అంటూ గూనివాడు వినోదుణ్ణి సమీపించబోయాడు.

వినోదుడు అడుగు వెనకకు వేశాడు. గూనివాడు కోపంగా కనుబొమలు ముడిచి, "అహంకారంతో ప్రవర్తించకు. నువ్వు నన్ను తప్పించుకోలేవు. నువ్వు ఈ జ్ఞాన భూమి పౌరుడివి కావాలంటే, నిన్ను తాకి, నీకు నామకరణం చేయాలి," అన్నాడు.

"వినోదుడన్న నా పేరుకేం లోటు? కొత్తగా నామకరణం ఎందుకు?" అన్నాడు వినోదుడు.



"నామకరణం చేసి తీరాలి. అయినా, యిక్కడికి వచ్చిన తర్వాత కూడా, నీ పేరు నీకెలా జ్ఞాపకం ఉన్నది?" అన్నాడు గూనివాడు కోపంగా.

"అది నాపేరు కనుక జ్ఞాపకం ఉన్నది," అన్నాడు వినోదుడు.

"నువ్వు ఆ నదిలో దిగగానే, నీ గతాన్నంతా మరిచిపోయి ఉండాలి. అలా కానప్పుడు, నువ్వీ జ్ఞానభూమి పౌరుడు కావడానికి వీలులేదు," అన్నాడు గూనివాడు.

"నువ్వనే, ఈ జ్ఞానభూమి పౌరుడు కావాలని నేను ఉబలాటపడటం లేదు. నేను ఈ ప్రాంతంకుండా వెళుతూన్న ఒక బాటసారిని మాత్రమే," అంటూ వినోదుడు ముందుకు నడిచాడు.

"మళ్ళీ అహంకారంతో మాట్లాడుతున్నావు. అయినా, ఈ జ్ఞానభూమి పౌరుడు కావడంలోని గొప్పదనం నువ్వు గ్రహించడంలేదు. నేనెంతో కాలంగా ఎందరెందరో పరదేశీయులను, ఈ జ్ఞాన భూమి పౌరులుగా మార్చి ఉన్నాను. కాని, నదిలో ఈదిన తరవాత కూడా, నీ గతాన్ని నువ్వు మరిచిపోలేదంటే ఆశ్చర్యంగా ఉన్నది. మరొకసారి నదిలో ఈది వస్తావా?" అన్నాడు గూనివాడు.

"అదేంకుదరదు!" అంటూ వినోదుడు ఒకసారి తన వేలికి ఉన్న ఉంగరంకేసి చూసుకున్నాడు. బంగారువిగ్రహం నుంచి తన వేలుకు చేరిన ఆ ఉంగరం కారణం

గానే, అపాయకరమైన ఆ నదీప్రభావం తనమీద పనిచేయలేదన్న విషయం అతడు గ్రహించాడు!

గూనివాడు కోపంతో చప్పట్లు చరిచాడు. ఆ చప్పట్లు కొండలలో వింత ప్రతిధ్వనులు సృష్టించాయి. ప్రతిధ్వనుల శబ్దం, తగ్గడానికి బదులు క్రమంగా హెచ్చసాగింది.

''ఇటువంటి వింత ప్రతిధ్వనులను నేనెన్నడూ వినలేదు. చాలా తమాషాగా ఉన్నది,'' అన్నాడు వినోదుడు.

''ఇది తమాషా కాదు, నాయనా! ప్రతిధ్వనుల శబ్దాన్ని హెచ్చుచేయడం మేము సాధించిన విజ్ఞానశాస్త్ర ఘనవిజయాలలో ఒకటి,'' అన్నాడు గూనివాడు.

అంతలో గుట్టలచాటు నుంచి సైనికులు కొందరు వాళ్ళకేసి రాసాగారు.

''ఆ పరదేశిని బంధించండి!'' అని ఆజ్ఞాపించాడు గూనివాడు.

వాళ్ళు వినోదుణ్ణి చుట్టు ముట్టారు. కాని, వినోదుడు ఒక్క గెంతున సైనికులకు ఆవలనున్న బండ మీదికి దూకి, వాళ్ళకు పట్టుబడకుండా పరిగెత్తసాగాడు. అయినా, సైనికులు వదలకుండా తరమసాగారు. అతడు పరిగెత్తి, పరిగెత్తి ఆఖరికి ఒక లోయ ప్రాంతాన్ని చేరుకున్నాడు. లోయ చివర ఒక పెద్ద భవనమూ, కొన్ని ఇళ్లూ అతనికి కనిపించాయి. అక్కడికి చేరుకున్నట్టయితే సైనికుల బారి నుంచి తప్పించుకోవచ్చునన్న ఆశతో, వినోదుడు శక్తికొద్దీ పరిగెత్తాడు. అయితే, సైనికులు మరింత వేగంగా అతణ్ణి సమీపించారు.

ఇక వాళ్ళకు పట్టుబడక తప్పదన్న భయంతో, వినోదుడు సైనికుల వైపు తిరిగి చూశాడు. అంతవరకు తనను వెన్నంటి తరుముకుని వచ్చిన సైనికులు, ఆ క్షణంలో అక్కడే నిలబడి పక్కన ఉన్న మరొక చిన్న కొండ మీదికి వణికిపోతూ చూస్తున్నారు.

వినోదుడు కూడా అటుకేసి చూశాడు. అక్కడి దృశ్యం అతనికి దిగ్భ్రాంతి కలిగించింది! —(ఇంకావుంది)






# స్వామిద్రోహి-మిత్రద్రోహి.

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, అర్ధరాత్రివేళ నక్కలూ, గుడ్లగూబలూ, భూతప్రేతాలూ సంచరించే యీ శ్మశానంలో, నువ్వుపడుతున్నశ్రమచూస్తూంటే, జాలి కలుగుతున్నది. లోకంలో స్వామిద్రోహులకూ, మిత్రద్రోహులకూ కొదువ లేదు. నువ్వు అలాంటి వాళ్ళ చేతిలో కీలుబొమ్మవై, యిలా యిక్కట్లపాలయ్యావేమో అన్న అనుమానం కలుగుతున్నది. ఆ ద్రోహుల నయవంచన ఎలా వుంటుందో, నీకు తెలిసేందుకుగాను, ఉదాహరణగా ఒక స్వామిద్రోహీ, మిత్రద్రోహీ కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ యిలా చెప్పసాగాడు:

## బేతాళ కథలు



స్వర్ణముఖి రాజ్యం రాజు ధర్మపాలుడు. ఆయనకు మహావీరుడన్న ఖ్యాతి వుండేది. ఆయన సేనాధిపతి నాగభైరవుడు గోముఖ వ్యాఘ్రం లాంటివాడు. నయవంచనలో అందె వేసినచేయి. అతను రాజుపట్ల ఎంతో వినయవిధేయతలు నటిస్తూ, సింహాసనం ఆక్రమించుకునేందుకు పథకాలు వేయ సాగాడు.

రాజు ధర్మపాలుడికి, తన సేనాధిపతి స్వామిద్రోహం తలపెట్టిన సంగతి ఏమాత్రం తెలియదు. నాగభైరవుడు, అదను చూసి కొంతమంది రాజోద్యోగులకు ధనాశచూపి, తనవైపు తిప్పుకుని, రాజూ రాణీలతోపాటు, యువరాజైన శశిసేనుణ్ణి కూడా బంధించాడు. ఆ ముగ్గుర్నీ వేర్వేరు చెరసాలల్లో వుంచి, దిట్టమైన కాపలా ఏర్పాటు చేసి, తను స్వర్ణముఖి రాజ్య సింహాసనం అధిష్ఠించాడు.

అయితే, రాజు, బందీగా వున్న చెరసాలలో, ఒక రహస్య సొరంగమార్గం వున్నది. ఆ సంగతి నాగభైరవుడికి తెలియదు. రాజు, ఆ సొరంగమార్గం గుండా తప్పించుకుని, ఒక అడవిని చేరాడు.

రాజు అడవిమార్గాన పోతూండగా, శిఖముఖి అనే దొంగ గుర్రం మీద వచ్చి, ఆయనను అటకాయించి, ''నీ ఒంటి మీద వున్న ఆభరణాలన్నీ వలిచి అక్కడ పెట్టు!'' అని గదమాయించాడు.

ధర్మపాలుడు మారుమాట్లాడకుండా, ఆభరణాలన్నీ తీసి, మూటగట్టి, చిరునవ్వుతో శిఖముఖికి అందించి, ముందుకు సాగబోయాడు.

శిఖముఖి, ఆయన్ని ఆపి, ''చూడబోతే గొప్పవాడిలా కనిపిస్తున్నావు. నీ దేహ దారుఢ్యం చూస్తే, నన్నెదిరించగలవాడిలా వున్నావు. అయినా కిక్కురుమనకుండా, ఆభరణాలన్నీ యిచ్చేశావు. ఎవరు నువ్వు?'' అని ప్రశ్నించాడు.

అందుకు ధర్మపాలుడు, ''నా పేరు ధర్మపాలుడు. స్వర్ణముఖి రాజును,'' అని చెప్పి, తన సేనాధిపతి చేసిన స్వామి

ద్రోహం వివరించి, ''ఆ స్వామిద్రోహి కన్న ఎదురుగా వచ్చి భయపెట్టి, దొంగతనం చేస్తున్న నీవే నయమనిపించావు. అందు వల్లనే, నిన్నెదిరించగలిగివుండీ కూడా ఆభరణాలన్నీ యిచ్చేశాను,'' అన్నాడు.

ఆ మాటలు వింటూనే, శిఖముఖి గుర్రం దిగి, ఆభరణాల మూటను ధర్మపాలుడి పాదాల ముందు పెట్టి, ''మహారాజా, క్షమించండి! నా దగ్గిర మెరికల్లాంటి పాతిక మంది దారిదోపిడీగాళ్ళున్నారు. అందరూ గొప్ప విలుకాళ్ళు. మీరు ఆజ్ఞాపిస్తే వచ్చి, ఆ నాగభైరవుడిని హతమార్చగలం,'' అన్నాడు.

''చాలా సంతోషం! అవసరం కలిగినప్పుడు వస్తాను. అలాగే సాయపడుదువు గాని,'' అని, ధర్మపాలుడు ముందుకు సాగాడు.

ఆయన అడవిలో మరి కొంతదూరం వెళ్ళేసరికి, అగ్నినేత్రుడనే రాక్షసుడు, ఒక చెట్టుకు చేరగిలబడి కూర్చుని, కోరలు తిరిగిన పెద్ద అడవిపందిని తినబోతున్నాడు. అది కర్ణకఠోరంగా అరుస్తున్నది.

రాజు అది చూసి, తల పక్కకు తిప్పుకుని ముందుకు నడవబోయాడు. అది గమనించిన రాక్షసుడు, ''మానవా! నన్ను చూసి కూడా నిర్భయంగా ముందుకు పోబోతున్నావు!'' అంటూ లేచి, రాజును ఎడంచేత్తో అంది పుచ్చుకున్నాడు.

ధర్మపాలుడు ఏమాత్రం భయపడలేదు. అది చూసిన రాక్షసుడు ఆశ్చర్య





పోతూ, "ప్రాణభయం లేని మనిషిని, యిదే చూడడం! నువ్వెవరివి?" అని అడిగాడు.

"నేను స్వర్ణముఖిరాజు ధర్మపాలుణ్ణి." అని, రాక్షసుడికి జరిగినదంతా చెప్పి, "రాజైనవాడికి ప్రాణ భయం వుండకూడదు," అన్నాడు.

రాక్షసుడు, రాజును నేల మీదికి దించి, "నీలో నిజమైన రాజలక్షణాలున్నవి. నీతో నగరానికి వచ్చి, ఆ ద్రోహి అయిన సేనాధిపతిని కాలరాస్తాను," అన్నాడు.

"అవసరం కలిగినప్పుడు, నీ సాయం కోరతాను," అని, ధర్మపాలుడు ముందుకు నడిచాడు.

వారం రోజుల తర్వాత, ధర్మపాలుడు పొరుగు రాజ్యమైన వైశాలిని చేరాడు. స్వర్ణముఖి రాజ్యానికి, వైశాలినీ రాజ్యానికీ తరతరాల నుంచి శత్రుత్వం వున్నది.

ధర్మపాలుడు, వైశాలినీ రాజైన సుచరితుణ్ణి కలుసుకుని, జరిగినదంతా చెప్పి, "తిరిగి నేను సింహాసనం అధిష్ఠించేందుకు సహాయపడగలవా?" అని అడిగాడు.

దానికి సుచరితుడు, "ధర్మపాలా, ఆజన్మశత్రువయినా సరే, ఆపదలో వున్నప్పుడు సహాయపడడం ధర్మమని, నా నమ్మకం. నేను సైన్యసమేతంగా, నీ వెంట వస్తాను," అన్నాడు.

ధర్మపాలుడు పెద్ద సైనికబలంతో పోయి, స్వర్ణముఖి నగరాన్ని ముట్టడించాడు. నాగభైరవుడికీ, ధర్మపాలుడికీ మధ్య భయంకరమైన ద్వంద్వయుద్ధం జరిగింది. నాగభైరవుడు గాయపడి ఓడి, ధర్మపాలుడి చేత చెరసాలలో బంధింపబడ్డాడు. రాణీ, యువరాజూ బంధవిముక్తులయ్యారు.

సింహాసనం అధిష్ఠించిన వెంటనే, ధర్మపాలుడు అడవిలో వున్న దొంగ శిఖముఖిని పిలిపించి, "నువ్వు దారి దోపిడీలు చేస్తూ, ప్రజలకు ప్రాణహానీ, ధననష్టం కలిగిస్తున్నావు. నీ అనుచరులతో సహా వెంటనే లొంగిపో. అలా కాక

పోతే, నిన్ను కఠినంగా శిక్షించవలసి వస్తుంది!'' అన్నాడు.

రాజు అన్న మాటలకు శిఖముఖి నొచ్చుకుని, ఏదో చెప్పబోయాడు. కాని, ధర్మపాలుడు తీవ్రస్వరంతో, ''నువ్వు వెంటనే అడవికి పోయి, నీ అనుచరులతో తిరిగి వచ్చి, లొంగిపో. ఇది, నా ఆజ్ఞ!'' అన్నాడు.

తర్వాత ధర్మపాలుడు, స్వయంగా అడవికిపోయి, రాక్షసుడు అగ్నినేత్రుణ్ణి కలుసుకుని, ''అగ్నినేత్రా, నువ్వీ అడవిలో వుండడం వలన, ప్రజలు యిటువైపు రావడానికి భయపడుతున్నారు: నువ్వీ అడవి ప్రాంతాన్ని వదిలిపో,'' అని చెప్పాడు.

''వదిలిపోకపోతే?'' అంటూ రాక్షసుడు కళ్ళెర్ర చేశాడు.

ధర్మపాలుడు చప్పున ఒర నుంచి కత్తి దూశాడు. అది చూసి రాక్షసుడు మెచ్చుకోలుగా తలాడించి, వెనుదిరిగి అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

కొద్ది రోజులు గడిచాక, ధర్మపాలుడు వైశాలినీ రాజు సుచరితుడిపై యుద్ధం ప్రకటించి, తన కొడుకు శశిసేనుడి నాయకత్వాన సైన్యాన్ని పంపాడు. శశిసేనుడు, సుచరితుణ్ణి అవలీలగా జయించి, అతణ్ణి బందీగా పట్టుకుని, తిరిగి వచ్చి, సింహాసనాసీనుడై వున్న తండ్రి ముందు నిలబెట్టాడు.



సుచరితుడు ఎంతో బాధగా, ''మహారాజా, మీరు, మన రాజ్యాల మధ్య వున్న పాత శత్రుత్వాన్ని మరిచిపోలేదన్న మాట!'' అన్నాడు.

అందుకు ధర్మపాలుడు నవ్వి, ''శత్రుత్వాన్ని, మిత్రత్వంగా మార్చడం, మీ చేతిలోని పని. మీ ఏకైకపుత్రిక నీహారికను, నా పుత్రుడు శశిసేనుడికిచ్చి, ఎందుకు వివాహం చెయ్యకూడదు!'' అన్నాడు.

సుచరితుడు కొంచెంసేపు మౌనంగా వూరుకుని, తర్వాత అంగీకార సూచకంగా

తలాడించాడు. ధర్మపాలుడు, అతడి చేతులకున్న సంకెళ్ళను పూడదీయవల సిందిగా ఆజ్ఞ యిచ్చాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, సేనాని నాగభైరవుడు రాజ్యకాంక్షతో, తాను సేవిస్తున్న మహారాజునే చెరసాలలో పెట్టిన స్వామిద్రోహి. మరి, రాజు ధర్మపాలుడి సంగతేమిటి? అతడు రాజ్యాన్ని కోల్పోయి కష్టదశలో వున్నప్పుడు, సాయం చేయవచ్చిన దొంగా, రాక్షసుడిపట్లనే కాక, సైన్యంతో వచ్చి, నాగభైరవుడిని, సింహాసనభ్రష్టుణ్ణి చేసిన రాజు సుచరితుడి పట్ల కూడా, మిత్రద్రోహిగా ప్రవర్తించాడు. నాగభైరవుడు స్వామిద్రోహి అయితే, ధర్మపాలుడు మిత్రద్రోహి కాదా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది." అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ధర్మపాలుడు, దొంగనూ, రాక్షసుణ్ణీ, సుచరితుణ్ణీ కలుసుకున్నప్పుడు, రాజ్యాన్నేలే రాజు కాదు; ఒక సామాన్య పౌరుడు. ఆ తర్వాత రాజయాక, తన రాజ్య ప్రజలను దొంగల బారి నుంచి కాపాడవలసిన బాధ్యత, ఆయనకున్నది. అందుకే దొంగను లొంగి పొమ్మన్నాడు. ఇదే రాజనీతి, రాక్షసుడికి కూడా వర్తిస్తుంది. ఇందులో మిత్రద్రోహం ఏమీ లేదు. ఇక పోతే, రాజు సుచరితుడి నుంచి సైనిక సాయం పొంది, ధర్మపాలుడు తిరిగి రాజ్యం గెలుచుకున్నాడు. ఇందువల్ల, పదిమందీ ఆయనను అసమర్థుడుగానో, పౌరుషహీనుడుగానో భావించే ప్రమాదం వున్నది. అలాంటి అపవాదు రాకుండా వుండేందుకు, సుచరితుణ్ణి ఓడించి, తను వీరుణ్ణని రుజువు చేసుకున్నాడు. ఇది కూడా రాజనీతిలో, ఒక భాగమే! ఇందులో మిత్రద్రోహమంటూ ఏమీ లేదు." అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# అత్తా-కోడలు

ఒక ఊళ్ళో ఒక పెద్దమ్మ. ఆ పెద్దమ్మకొక కొడుకు. పెద్దమ్మ కొడుక్కి పెళ్ళీడు వచ్చింది. పెద్దమ్మ తన కొడుక్కి మంచి అందమైన పిల్లను చూసి పెళ్ళి చేసింది. పెద్దమ్మ కోడలు కొద్ది రోజుల్లో ఊడేరి కాపరానికి వచ్చింది.

"అత్త లేని కోడలు ఉత్తమురాలు!" అని సామెత. అందుచేత పెద్దమ్మ కోడలు తన అత్తగారు పోతే, తానూ మొగుడూ హాయిగా ఉండొచ్చు గదా అనీ, తనను అంతా మంచిది అనుకుంటారు గదా అనీ అనుకున్నది.

అందుకని ఆమె ఒకనాడు పెద్దమ్మతో "అత్తా, అత్తా! నేను కాపరాని కొచ్చాను గదా, ఇంటి పనులన్నీ నేనే చేసుకుంటాను గదా, నువు చచ్చిపో, అత్తా!" అన్నది.

"ఒసే, ఒసే, అలాగే చచ్చిపోతాను గాని, నాకు ఒక్క ముచ్చట తీరలేదే. నీ కడుపున ఒక నలుసు పుడితే చూసి మరీ పోతానే!" అన్నది పెద్దమ్మ.

"ఇంతే గదా," అనుకుని పెద్దమ్మ కోడలు సంతోషించింది.

కొద్దికాలానికే పెద్దమ్మ కోడలు కడుపుతో ఉండి ఒక కొడుకును కన్నది. పెద్దమ్మ మనవణ్ణి ఎత్తి ఎంతో సంతోషించింది.

"అత్తా, అత్తా! మనవణ్ణి కళ్ళ చూశావు గదా, ఇక చచ్చిపో, అత్తా!" అన్నది పెద్దమ్మ కోడలు.

"కాస్త ఓపిక పట్టవే! మనవడి అచ్చట్లూ ముచ్చట్లూ చూసుకుని పోతాలే. వాడికి పుట్టువెంట్రుకలు తీసి అక్షరాభ్యాసం అయేదాకా ఉండి మరీ పోతా," అన్నది పెద్దమ్మ.

అయిదేళ్ళు గడిచాయి. పెద్దమ్మ మనవడి అక్షరాభ్యాసం చేశారు.

"ఇక నువు చచ్చిపో, అత్తా!" అన్నది పెద్దమ్మ కోడలు.

"మనవడికి కాస్త జంఝప్పొగు పడనీవే, పోతానూ!" అన్నది పెద్దమ్మ.

కొంతకాలానికి పెద్దమ్మ మనవడికి ఉపనయనం చేశారు.

"ఇక నువు చచ్చిపో, అత్తా!" అన్నది పెద్దమ్మ కోడలు.

"ఏమయిందో అయింది. మనవడి పెళ్ళి కళ్ళారా చూసి పోతానే," అన్నది పెద్దమ్మ.

పెద్దమ్మ మనవడికి పెళ్ళి ఈడు వచ్చింది. మంచి సంబంధం చూసి పెళ్ళి చేశారు.

"మనవడి పెళ్ళి కూడా చూశావు. ఇక నువు చచ్చిపో, అత్తా!" అన్నది పెద్దమ్మ కోడలు.

"మరేంలేదు గాని, మనవడూ వాడి భార్యా చిలకాగోరింకలల్లే కాపరం చేస్తూంటే చూసి మరీ పోదామని ఉన్నదే!" అన్నది పెద్దమ్మ. పెద్దమ్మ మనవడి భార్య కాపరాని కొచ్చింది. పెద్దమ్మ కోడలు కూడా అత్తగారయింది.

పెద్దమ్మ తన కోడలుతో, "ఏమే, నా కోరికలన్నీ తీరాయే! ఇక చచ్చిపోదామనుకుంటున్నాను. మరి నీ కోడలు కూడా కాపరానికి వచ్చిందిగా. నువు మాత్రం దేనికి? ఇద్దరమూ కలిసే చద్దాం పట్టు!" అన్నది.

పెద్దమ్మ కోడలు గుండె గుభేలు మన్నది. "పెద్ద చిక్కే పెట్టుకున్నానురా, భగవంతుడా! ఇప్పుడు బయటపడడ మెలాగ?" అనుకుని ఆమె పెద్దమ్మతో, "మీరు చచ్చిపోతానంటే నాకేదోలాగుంది, అత్తయ్యా! మీరు చచ్చిపోవద్దు. మీకేం తక్కువ? ఇంటి పనులన్నీ నా కోడలు చూసుకుంటుందిగా, మీ పనులన్నీ నేను చూస్తాను. మీకేం తక్కువయిందీ? మీ రెందుకు చచ్చిపోవాలీ?" అన్నది.

పెద్దమ్మ కోడలి మార్పుకు నవ్వుకుని కోడలి చేత సమస్తమైన ఉపచారాలూ చేయించుకుంటూ హాయిగా ఉన్నది.



మనదేశపు అద్భుతాలు:

# అమృతసర్ - స్వర్ణ దేవాలయం




నాలుగవ శిక్కు గురువయిన రామదాసు కాలంలో అమృతనర్ న్వర్ణ దేవాలయం నిర్మించబడింది. సుప్రసిద్ధమైన ఈ స్వర్ణ దేవాలయాన్ని శిక్కులు అతి పవిత్రంగా భావిస్తారు. ఈ అలయానికి నాలుగు వైపులా నాలుగు ద్వారాలు, భక్తులందరికీ స్వాగతం పలుకుతున్నట్టు వెలుగొందుతున్నవి.




అక్బరు చక్రవర్తి ఈ ప్రాంతాన్ని నాలుగవ శిక్కు గురువైన రామదాసుకు కానుకగా ఇచ్చాడు. 1579 వ సంవత్సరంలో గురువు అక్కడ ఒక తటాకాన్ని త్రవ్వించి, దానికి అమృతసరస్సు అని నామకరణం చేశాడు. ఆ తటాకం చుట్టూ ఏర్పడిన నగరానికి కూడా, ఆ పేరే స్థిరపడిపోయింది.

ఐదవ గురువైన అర్జునదేవ్, తటాక మధ్యంలో ఆలయం నిర్మించడానికి ప్రారంభించాడు. శిక్కుమతం, ఒక తెగకు మాత్రమే పరిమితం కాదన్న విషయం చాటడానికి, ఆయన ఆ దేవాలయ పునాదులను, మియాన్ మీర్ అనే ఒక ముస్లిం మత పెద్ద చేత వేయించాడు.





1803 వ సంవత్సరంలో మహారాజా రంజిత్ సింగ్, ఆలయం కింది సగం భాగాన్ని చలువరాళ్ళతో పొదిగాడు. పై భాగాన్ని రాగి రేకులతో కప్పి ఆ పిమ్మట 400 కి॥ గ్రా॥ బంగారంతో పూత వేయించాడు.

స్వర్ణ దేవాలయం పక్కనే శిఖ్ఖు గురు పీఠమైన అకాల్ తఖ్త్—అమర సింహాసనం ఉన్నది. ఆరవ శిఖ్ఖు గురువైన హరిగోవింద్ దీనిని స్థాపించాడు. గురువులు ఉపయోగించిన ఆయుధాలు ఇక్కడ పదిలంగా భద్రపరచబడి ఉన్నాయి.





స్వర్ణ దేవాలయంలో సంగీతమూ, మంత్ర పఠనమూ నిరంతరాయంగా కొనసాగుతూ ఉంటుంది. ఆలయ దర్శనానికి భక్తులు తండోపతండాలుగా వస్తూ వుంటారు. ఈ ఆలయ ప్రాంగణం ఎంతో చారిత్రక ప్రాముఖ్యత కలిగి ఉన్నది.

అమృతసర్‌లోని మరొక ముఖ్యమైన మత సంస్థ బాబా అటల్ గురుద్వార. మహనీయులెందరో ఉపయోగించిన పవిత్ర వస్తు సముదాయం ఇక్కడ ఉన్నది. మత సంబంధమైన కార్య కలాపాలతో ఈ స్థలం సందడిగా వుంటున్నది.





బాబా అటల్ గురుద్వారలో, శిక్కుమత చారిత్రక ఘట్టాలు చిత్రింపబడిన రేకులు కొన్ని ఉన్నవి. స్వర్ణ దేవాలయానికి సమీపంలో నిర్మింపబడి ఉన్న ఈ తొమ్మిది అంతస్థుల భవనం— హరగోవిందగురు కుమారుడైన బాబా అటల్ రాయ్‌ని జ్ఞాపకం చేస్తుంది.

స్వర్ణదేవాలయానికి దక్షిణ దశలో బ్రహ్మాండమైన గురూ కా బాగ్—గురు వనం ఉన్నది. 30 ఎకరాల వైశాల్యంతో, దానిమ్మ, నారింజ మొదలైన ఫలవృక్షాలతో ఈ వనం ప్రశాంతగంభీరంగా వెలుగొందుతున్నది. ఈ వనంలో ఒక కొలనూ, చిన్నచిన్న మంటపాలూ ఉన్నవి.






స్వర్ణదేవాలయానికి సమీపంలోనే జలియన్‌వాలా బాగ్ ఉన్నది. 1919 వ సంవత్సరం ఏప్రిల్ 13 న, దుర్మార్గుడైన బ్రిటిష్ అధికారి ఆనతిపై. ఆడ, మగ, పిల్లలు అన్న వివక్షత లేకుండా 2000 మంది అమాయకులు ఇక్కడ చంపబడ్డారు. స్వాతంత్ర్య త్యాగుల స్మృతిచిహ్నంగా ఇప్పుడు ఇక్కడ జాతీయ స్మారక భవనం వెలుగొందుతున్నది.



# కొంటెదయ్యాలు

వీరవరం గ్రామంలో, ముత్యాలయ్య అనే సామానులు మోసి జీవించే కూలివా డొకడుండేవాడు. వాడికి భార్యా, నలుగురు కొడుకులు. చంద్రముఖినది ఒడ్డున వచ్చే పోయే ప్రయాణీకుల సామానులు చేర వేస్తూ, ప్రతి రోజూ అవసరానికి మించి సంపాయిస్తున్నాడు. ఈ విధంగా వాడు, భార్యా బిడ్డలకు ఏ లోటూ లేకుండా పోషిస్తూ, సంపాదనలో కొంత వెనక వేస్తున్నాడు కూడా.

అయితే, ముత్యాలయ్యకు హఠాత్తుగా, ఆ సంపాదన మీద విసుగుపుట్టి, తన కెలాగైనా నడమంత్రపుసిరి లభిస్తే, దానితో సుఖంగా జీవించవచ్చునన్న ఆలోచన గలిగింది.

వీరవరానికి దక్షిణాన వున్న, చింతలపూడి అడవులలో దయ్యాలున్నట్టు ముత్యాలయ్య చాలామంది అనుభవాల ద్వారా విని వున్నాడు. వాటిని మంచి చేసుకుని, వాటి సాయంతో కోటీశ్వరుడై పోవాలన్న నిశ్చయానికి వచ్చాడు.

ఒకనాడు వాడు తెల్లవారుజామునే లేచి, చింతలపూడి అడవులకేసి బయలుదేరాడు. అడవిలో కొంతదూరం నడిచాక, వాడికి ఒక ఊడలమర్రి కనిపించింది. దయ్యం ఒకటి, ఆ ఊడలను పట్టుకుని ఊగుతున్నట్టు వాడు గుర్తించాడు.

ముత్యాలయ్య ధైర్యంగా చెట్టు కిందికి పోయి, దయ్యాన్ని చూడనట్టు నటిస్తూ, ఒకచోట కూర్చుని, బిగ్గరగా ఏడవడం ప్రారంభించాడు.

కొద్దిసేపు గడవగానే, దయ్యం ఊడలను వదిలి, వాడి ముందు దూకి, వాడి భుజం తట్టి, "నీ కొచ్చిపడ్డ కష్టం ఏమిటి? త్వరగా చెప్పు! నాకు తోచిన సాయం చేస్తాను," అన్నది.

రాంబాబు




ముత్యాలయ్య మరింత బిగ్గరగా ఏడుస్తూ, "నాది గంపెడు సంసారం. చేతిలో చిల్లిగవ్వ లేదు. పెళ్ళాం, పిల్లలు ఆకలితో అలమటించి పోతున్నారు," అన్నాడు.

"అలాగా, పాపం! ఇంకేం బాధ పడకు," అంటూ దయ్యం గాలిలో చేయి వూపి, ఒక బంగారు పాత్రా, దాని నిండా బంగారు నాణాలూ సృష్టించి, ముత్యాలయ్యకు యిస్తూ, "ఇవి పట్టుకుని, తిన్నగా యిలా తూర్పు దిక్కుగా వెళ్ళు. మళ్ళీ ఏనాడైనా అవసరం కలిగితే, మొహమాట పడక, యీ ఊడలమర్రి దగ్గిరకురా!" అని చెప్పింది.

ముత్యాలయ్య సంతోషంగా, దయ్యం యిచ్చిన బంగారుపాత్రతో బయలుదేరి కొంతదూరం వెళ్ళేసరికి, రెండు దయ్యాలు ఎదురుపడి, వాడి చేతిలోని బంగారు పాత్రా, అందులో వున్న బంగారునాణాలూ చూసి, "అయ్యో, ఎవరైనా సుఖపడుతూంటే, మేం చూడలేం! ఈ డబ్బుతో యిక నువ్వు కష్టాలు మరిచి, సుఖపడిపోతావు. ఆలస్యం చేస్తే ప్రమాదం," అంటూ వికృతంగా నవ్వాయి.

ఆ మరుక్షణం, ముత్యాలయ్య చేతిలోని బంగారుపాత్ర, మట్టిపాత్రగా మారిపోయి, అందులో వున్న నాణాలు చిల్లపెంకులయిపోయాయి.

ముత్యాలయ్య జరిగింది చూసి, కోపంగా పాత్రను నేలకేసి కొట్టాడు. దయ్యాలు రెండూ కొంచెంసేపు, వాడిచుట్టూ గెంతుతూ నవ్వి, మాయమయినై.

వాడు పుట్టెడు దిగులుతో ఇంటికి తిరిగి వచ్చి, మర్నాడు కూలిపనికి పోకుండా, చింతలపూడిఅడవులకేసిబయలుదేరాడు. వాడు ఊడలమర్రిని సమీపిస్తూండగా, వాడికి మేలు చేసిన దయ్యం, ఊడల మీద హాయిగా ఉయ్యాల ఊగుతూ కనిపించింది.

ముత్యాలయ్య, దయ్యానికి జరిగినదంతా చెప్పాడు. దయ్యం అంతా విని,

''నువ్వేమీ దిగులుపడకు. ఎవరైనా కష్టాలలో వుంటే, నే చూడలేను. అలాంటి వాళ్ళకు సాయపడడమే, నాకు తృప్తి.'' అంటూ, మళ్ళీ బంగారుపాత్రనూ, నాణాలనూ సృష్టించి, ముత్యాలయ్యకు యిచ్చి, ''ఈసారి నువ్వు, యిలా దక్షిణదిక్కుగా పో!'' అని చెప్పింది.

వాడు, దయ్యం చెప్పినట్టు, దక్షిణ దిక్కుగా ప్రయాణమయ్యాడు.

అయితే, కొంతదూరం వెళ్ళే సరికి, యితరుల సుఖం చూడలేని దయ్యాలు రెండూ, వాడికి ఎదురుపడి, ''ఓహో, నీ అదృష్టం పండినట్టున్నదే! ఎంత చక్కని గుడ్లగూబ!'' అన్నవి వికవికమని నవ్వుతూ.

ఆ వెంటనే ముత్యాలయ్య చేతిలోని బంగారుపాత్ర మాయమై, దాని స్థానంలో, ఒక పెద్ద గుడ్లగూబ వున్నది. దాన్ని చూస్తూనే, వాడికి ఒళ్ళు జలదరించి, దూరంగా విసిరివేశాడు. దయ్యాలు రెండూ మాయమయినై.

ముత్యాలయ్య, ఇంటికి తిరిగి వచ్చాడు. ఆ మర్నాడు కూడా వాడు కూలిపనికి పోకుండా, యీసారి తనకు పట్టబోయే అదృష్టాన్ని, జాగ్రత్తగా కాపాడుకోవాలనుకుంటూ, ఊడలమర్రి దగ్గిరకు వెళ్ళాడు.

అక్కడ దయ్యం కనిపించగానే, వాడు, దానికి జరిగినదంతా చెప్పాడు. దయ్యం వాడి మీద ఎంతో జాలిపడుతూ, ''నీలాంటి వాళ్ళకు సాయపడడమేగదా, నా పని!''



అని, బంగారు పాత్రనూ, నాణాలనూ యిచ్చి, ఈసారి ఈశాన్యదిక్కుగా వెళ్ళమని చెప్పింది.

ముత్యాలయ్య దయ్యం కేసి కోపంగా చూస్తూ, "ప్రతిసారీ, నువ్వు చెప్పిన దిక్కుగా వెళుతూంటే, నాకు నష్టం కలుగుతున్నది. అందువల్ల, వచ్చినదారినే ఇంటికి పోతాను," అన్నాడు.

ఆ మాటలకు దయ్యం కళ్ళెర్రచేసి, కష్టాలలో వున్నవాళ్ళకు సాయం చేయడం, నా పని. అలాగే, నీకు కనిపించిన, నా స్నేహితులిద్దరికీ, నా నుంచి సాయం పొందినవాళ్ళను ఏడిపించడం సరదా. నువ్వు యిప్పుడు, నేను చెప్పిన దిక్కుగా వెళ్ళకపోతే, వాళ్ళు నీ కోసం చూసి చూసి, నిరాశచెంది బాధపడతారు. వాళ్ళు బాధ పడడం, నే చూడలేను. మేం ముగ్గురం ప్రాణస్నేహితులం. నువ్వు, ఈశాన్య దిక్కుగా వెళ్ళకపోతే, వాళ్ళనే యిక్కడికి పిలుస్తాను," అంటూ వికృతంగా కేక పెట్టి మాయమైంది.

అదే క్షణంలో, కొంటె దయ్యాలు రెండూ, అక్కడ ప్రత్యక్షమై, ముత్యాలయ్య చేతిలోని బంగారు పాత్రనూ, నాణాలనూ బూడిదగా మార్చి, కేరింతలు కొడుతూ, ఊడలమర్రి మీదికి ఎగిరి పోయినై.

ఇది చూస్తూనే ముత్యాలయ్యకు, దయ్యాల నాటకం బాగా అర్థమైంది. వాటిల్లో ఒక దయ్యం తనకు బంగారం యిస్తున్నట్టు నటిస్తూంటే, మిగిలిన రెండూ దాన్ని మాయం చేసి తనను ఆటపట్టిస్తూ వినోదిస్తున్నవన్న మాట! ఆ సమయంలో వాడికి, దురాశ దుఃఖం చేటన్న పెద్దల మాట గుర్తుకొచ్చింది. ఇప్పటికే తను మూడు రోజుల కూలి డబ్బులు నష్టపోవడమేగాక, ఎంతో శరీర శ్రమకు గురయ్యాడు.

ఆ తర్వాత ముత్యాలయ్య, ఎన్నడూ దురాశలకుపోక, తనకు దొరికిన కూలి పనులు చేసుకుంటూ తృప్తిగా బతక సాగాడు.





# కృష్ణావతారం

గోకులమంతా ఒక్కసారి కదిలింది. అందరూ ఎడతెరపిలేని ప్రయాణసన్నాహంలో మునిగిపోయారు. బరువులు బళ్ళకెత్తారు. నేతులూ, పాలూ గల కుండలను భద్రపరిచారు. సంచులలో ధాన్యమూ, బియ్యమూ మొదలైనవి పోసి భద్రంగా కట్టారు. రకరకాల తాళ్ళూ, పలుపులూ, కవ్వాలూ, కొడవళ్ళూ, కత్తులూ, గంటలూ, పశువులనోళ్ళు తెరవటానికి ఉపయోగించే సాధనాలూ మొదలైన పనిముట్లన్నీ జాగ్రత్తపరిచారు. ప్రయాణసన్నాహం పూర్తి అయింది.

బలశాలులు పశువులను తోలుకుంటూ ముందు బయలుదేరారు. మందల వెనకగా బళ్ళు నడిచాయి. వాటి వెనక మనుషులు కదిలారు. వయసులో ఉన్న ఆడవాళ్ళంతా ఒక జట్టుగా నడుస్తూ, పరాచకాలాడుకుంటూ వినోదంపొందారు. కుంటి, గుడ్డి, ముసలివాళ్లు నడవలేకుండా ఉంటే వాళ్ళకు యువకులు సహాయపడ్డారు.

ఈ విధంగా గోకులం బృందావనానికి వచ్చి చేరింది. గోపాలకులలో పెద్దలైన వాళ్ళు, ఇళ్ళు కట్టుకోవటానికి స్థలాలు నిర్ధారణ చేశారు. బళ్ళన్నీ ఒక వరసలో అర్ధచంద్రాకారంలో దిగాయి. కొందరు గుడిసెలు నిర్మించారు. కొందరు లతాగృహాలనే తాత్కాలికంగా ఇళ్ళుగా వాడుకున్నారు. కొందరు చెట్లకింద కాపరాలు పెట్టేశారు. కొందరు కంపపేర్చి దొడ్లు

5. విషవృక్ష నిర్మూలనం



పుట్టుకొచ్చాయి. అవి వణుకుతూ, నిలబడలేకపోయాయి. నోట నురుగులు కక్కాయి. వాటి మెడలు వాలబడి పోయాయి. గిట్టలు పగిలి పురుగులు బయటికొచ్చాయి.

ఈ తెగుళ్ళకు గోపాలకులు మంత్రాలూ, మందులూ, మాకులూ, అన్నీ ప్రయోగించి చూశారు. కాని ప్రయోజనం లేక పోయింది. ఇక ఏం చెయ్యాలో వారికి తోచలేదు. ఈ తెగుళ్ళు యమునానదీ ప్రాంతపు అరణ్యాలలోని సమస్త మృగ పక్షి కీటక జాతులకూ వచ్చాయి. వాటి నుంచి గోపకులకు కూడా రోగాలు తగిలాయి.

నందుడూ, యశోదా, రోహిణీ కూడా రోగగ్రస్థులయారు. ఆ స్థలం వదిలిపెట్టి పోతేగాని బతకలేమని కృష్ణుడికి తోచింది. అతను బలరాముడితో మాట్లాడి, కొన్ని మందలను తోలుకుని ఒక కోసుదూరం వెళ్ళి అక్కడ ఆగాడు. అతనిలాగే మరి కొందరు గోపకులు కూడా అలాగే చేశారు. అలా వెళ్ళిపోయిన గోవులకూ, మనుషులకూ వ్యాధి సోకలేదు.

నందుడు మాత్రం కదలననే శాడు. "ఇది మన చోటు. ఇక్కడ ఏమి వచ్చినా భరించవలిసిందే గాని, చుట్టాలందరినీ వేసుకుని ఎక్కడికని వెళ్ళేది?" అన్నా

నిర్మించారు. ఒక్క రోజు గడిచే సరికల్లా బృందావనం గోపకులకు స్వస్థలమయి పోయింది. రోజులు గడిచేకొద్దీ, చక్కగా అలంకరించుకు తిరిగే గోపికలతోనూ, ఏదో పని మీద అడావుడిగా తిరిగే గోపాలకులతోనూ, గోవుల మందలతోనూ ఆ ప్రదేశానికి ఎక్కడలేని కళా వచ్చింది.

నానాటికీ గోపకులంవాళ్ళ సంపద పెంపొందుతున్నది. క్రమంగా మందలు పెద్దవవుతున్నాయి. జీవితం హాయిగా నడుస్తున్నది. అప్పటికి కృష్ణుడు పద మూడేళ్ళ వాడయాడు.

వేసవి వచ్చింది. నిక్షేపంగా ఉన్న పశువులకు హఠాత్తుగా రకరకాల తెగుళ్ళు

డతను. నంద యశోదా రోహిణులు రోగంతో తీసుకుంటూ ఇలా మూర్ఛించే సరికి ఏం చెయ్యాలో కృష్ణుడికి తెలియ లేదు.

ఈ గోకులంలో విదేహదేశం నుంచి వచ్చిన ముసలిగోపకు డొక డున్నాడు. అతను గోపప్రముఖులతో, "చూడండి, నాయనలారా! మనం పశువుల నాశ్ర యించి బతుకుతున్నవాళ్ళం. పశుపతి శివుడు. భక్తి శ్రద్ధలతో శివార్చన చేస్తేనే గాని మనకీ కష్టాలు తీరవు. ఇలా దిగాలు పడి చూస్తూ కూర్చుంటే ఏమీ లాభం లేదు. తెలిసిన బ్రాహ్మణులను పిలిపించి వెంటనే శివార్చన జరిపించండి," అన్నాడు.

పెద్దవాడు చెప్పిన మాటపైన గురి ఉంచి గోపకులు సమర్థులైన బ్రాహ్మణు లను పిలిపించి శివపూజకు అవసరమైన ఏర్పాట్లన్నీ చేశారు. ఈశ్వరుడికి వారం రోజులపాటు పగలూ, రాత్రీ అభిషేకమూ, అర్చనా, నైవేద్యమూ జరిగాయి. ఏడు రోజులూ నిర్విఘ్నంగా శివార్చన జరగగా, ఏడోనాటి మధ్యాన్నం ఒక సద్బ్రాహ్మ ణుడికి పూనకం వచ్చింది. ఆ పూనకంలో ఆ బ్రాహ్మణుడు వెర్రిగా నవ్వుతూ, భయంకరంగా నాట్యం చేస్తూ ఇలా అన్నాడు:



"నన్ను పరమశివుడు కైలాసం నుంచి పంపాడు. "ఒరే, శంఖకర్ణా, కాళిందీ తీరాన రోగాలతో తీసుకుంటున్న ప్రాణు లకు మేలు చెయ్యి, వెళ్ళు!" అని నాతో అన్నాడు. మీరు చేసిన అర్చనకు శివుడు సంతోషించాడు. మీ కందరికీ ఈ రోగాలు రావటానికి కారణం తెలుసా? ద్వాపర యుగాంతంలో రాక్షసులందరూ భూలో కాన్ని పీడించటానికి రకరకాల జన్మ లెత్తేటప్పుడు, కాలకలి అనే రాక్షసుడు, విరోచనుడి కొడుకు, ఒక విషపు వెలగ చెట్టుగా యమునానదికి దక్షిణ తీరాన మొలిచాడు. ఆ చెట్టు చుట్టూ ఆ రాక్షసుడి బంట్లందరూ విషవృక్షాలుగానూ, ముళ్ళ



చెట్లుగానూ పుట్టారు. ఆ విషపు వెలగ చెట్టు గాలిసోకి మీకూ, మీ పశువులకూ ఈ రోగాలు వచ్చాయి. దాని మూలంగా చుట్టుపక్కల నీరు కూడా చెడిపోయింది. ఆ విషవృక్షాన్ని సమూలంగా నిర్మూలించే శక్తి మీలో నందగోపుడి కొడుక్కూ, బలరాముడికీ ఉన్నది. వాళ్ళందుకు ఒప్పుకునే పక్షంలో మీరంతా బతికిపోతారు. ఈ మాట మీకు చెప్పమని పరమశివుడు నన్ను పంపాడు. ఇక నేను పోతాను, సెలవిప్పించండి.''

ఈ మాటలంటూండగానే బ్రాహ్మణుడికి పూనకం దిగిపోయింది. బ్రాహ్మణులు సంతోషించి, శివార్చన పరిసమాప్తి చేసేశారు. వెంటనే గోపకులు బలరామ కృష్ణులను పిలిపించి, వారికి సంగతంతా చెప్పారు. అంతా విని వాళ్లు, ''ఈశ్వరాజ్ఞ అయింది. తల్లిదండ్రులనూ, కులంవాళ్ళనూ బతికించుకునే అవకాశం కన్న కావలిసినదేమున్నది? ఆ విషపు వెలగ చెట్టును తప్పక నిర్మూలిస్తాం,'' అన్నారు అమితోత్సాహంతో.

కృష్ణుడు బ్రాహ్మణులకు నమస్కారం చేసి, శంకరుడి ముందు సాష్టాంగపడి, శివాలయం చుట్టూ భక్తితో ప్రదక్షిణ చేసి బలరాముడి కేసి చూశాడు. బలరాముడు కూడా అలాగే చేశాడు. తరవాత వాళ్లిద్దరూ కత్తులూ, గొడ్డళ్ళూ తీసుకుని అడవిలో విషవృక్షం ఉండే ప్రాంతానికి బయలుదేరారు.

శివార్చనతోనే చాలామంది గోపకులకు ఆరోగ్యం కలిగింది. వాళ్ళందరూ కూడా సింహనాదాలు చేస్తూ బలరామకృష్ణుల వెంట బయలుదేరారు.

విషవృక్షం ఎక్కడ ఉన్నదా అని వెతికే అవసరం కూడా లేకపోయింది. వాళ్ళు కీకారణ్యం కేసి నడిచే కొద్దీ చెట్టు నుంచి వచ్చే దుర్గంధం దుర్భరం అయింది. త్వరలోనే ఆ విషవృక్షం వారికి భయంకరాకారంలో ఎదురుగా కానవచ్చింది. అది ఆకాశమంత ఎత్తుండి ఒక



పెద్ద భూతంలాగున్నది. దాని చుట్టూ చాలా దూరం దాకా దారుణమైన ముళ్ళ చెట్లు వ్యాపించి ఉన్నాయి. బలరామ కృష్ణులు కత్తులతో ఆ ముళ్ళపొదలను నరికి దారి చేసుకుంటూ విషవృక్షాన్ని సమీపించారు.

ఆ విషపు వెలగచెట్టు మొదలు ముప్పై బారలున్నది. దాని కాయలు ఏనుగు తల లంతేసి ఉన్నాయి. దాని కొమ్మలు అన్ని వైపులకూ అంతులేకుండా వ్యాపించి ఉన్నాయి. దుర్గంధమంతా ఆ చెట్టు కాయలనుంచే వస్తున్నది. అందుచేత ముందుగా వాటిని నిర్మూలించాలను కున్నాడు కృష్ణుడు.

బలరామకృష్ణు లిద్దరూ కలిసి చేతి కందిన పిందెలనూ, కాయలనూ, దోర కాయలనూ, పళ్ళనూ తెంచిపారెయ్య నారంభించారు. అందని వాటిని రాళ్ళ తోనూ, కర్రలతోనూ కొట్టి రాల్చారు. అందీ అందని కొమ్మలను పట్టి వంచి పెళపెళా విరిచేశారు.

గోపాలకు లందరూ పెద్ద పెట్టున కేకలు పెడుతూ ఈ పనిలో వారికి సహాయపడ్డారు. కొంతసేపటికి చెట్టు మీద ఒక్క పిందె కూడా మిగలలేదు.

బలరామకృష్ణులు ఈ విధంగా విష వృక్షాన్ని ధ్వంసం చేస్తూ ఉంటే కొన్ని ఆవులూ, దూడలూ గోపకులపైకి దౌర్జన్యంగా వచ్చాయి. అవి మామూలు ఆవులూ, దూడలూ కావు. అక్కడ చెట్లు గానూ, పొదలుగానూ జన్మించిన రాక్షసుల భార్యలూ, వాళ్ళ పిల్లలూ పశువుల రూపంలో అక్కడ సంచరిస్తున్నారు.

కృష్ణుడు ఈ పశువులను నిర్మూలించ సాగాడు. రాక్షసులు తమ అసలు రూపా లతో, అక్కడే పడిపోయి నెత్తురు కక్కుతూ, చచ్చిపోనారంభించారు. గోమా తలుగా ఉన్న రాక్షసస్త్రీలు మండిపడి, కృష్ణుణ్ణి తమ కొమ్ములతో పొడిచి చంప బోయారు. కృష్ణుడు అవలీలగా వాటిని అక్కడి నుంచి పారదోలాడు. ఆ తరవాత

కొంత సేపటికి అతను విషవృక్షాన్ని పూర్తిగా ధ్వంసం చేసేశాడు.

గోపకుమారు లందరూ కలిసి ఆ చెట్టు తుండాలనూ, చుట్టూ ఉండిన ముళ్ళ పొదలనూ, చచ్చిన రాక్షస కళేబరాలనూ ఒక గుట్టగా వేసి, ఆ గుట్టకు నిప్పు అంటించారు. చూస్తుండగానే మంటలు ఆకాశమెత్తు లేచాయి. అగ్నిహోత్రుడా చెట్లనూ, పొదలనూ, రాక్షస కళేబరాలనూ, అతి ప్రీతిగా దహనం చేసి ఇంత బూడిద మిగిల్చాడు.



గోపాలకు లందరి శరీరాలూ చెమటతో తడిసి, నుసి అంటుకున్నాయి. వాళ్ళు చాలా శ్రమపడి అలిసిపోయి ఉన్నారు. అందుచేత అందరూ ఇసుక మీదుగా యమునానదికి వెళ్ళారు. అక్కడ వాళ్ళు చాలా సేపు ఈతలు కొట్టారు, ఓలలాడారు, నీటి మీద చేతులతో దరువులు వేస్తూ పాటలు పాడారు. ఆ విధంగా పొద్దు వాలేదాకా హాయిగా జలక్రీడలాడి సాయంకాలం వేళకు నీటి నుంచి బయటికి వచ్చి, తల్లులు తెచ్చిన భోజనాలు తిని, తాంబూలాలు వేసుకుని, కాస్సేపు విశ్రాంతి తీసుకుని మళ్ళీ ఆడుతూ, పాడుతూ ఇళ్ళకు తిరిగి వచ్చారు.

రోజులు గడుస్తున్నాయి. మనుషులకూ, పశువులకూ వచ్చిన తెగుళ్ళు క్రమంగా నివారణ అయాయి. ఇంతలో వేసవి కూడా గడిచిపోయింది. వర్షాకాలం ఆరంభం కాబోతున్నట్టు గుర్తుగా ఆకాశాన నల్లని మేఘాలు కమ్మసాగాయి. మేఘ గర్జన వినిపించి అందరికీ ఎంతో ఉత్సాహం పుట్టుకొచ్చింది. త్వరలోనే వడగళ్ళతో సహా వాన ఆరంభమయింది. ధారాపాతంగా వర్షం పడింది. భూమి అంతా పచ్చగా అయింది. సెలయేళ్ళూ నిండుగా పారాయి.

ఇలాంటి ఆనంద సమయంలో, విదేహ దేశంలో ప్రజలందరినీ భయోత్పాతంలో ముంచెత్తే కొన్ని విపరీత సంఘటనలు జరగసాగినై. ఆ ప్రాంతాల నివసించే

వారిలో కుంభకుడనేవాడు గొప్ప గోధనాలు కలవాడు. అతడు దాతృత్వానికీ, ధర్మ గుణానికీ పేరు పొందినవాడు. అర్థులకు లేదనకుండా, అతడూ, అతడి భార్య అయిన ధర్మద దానాలు చేస్తూండేవారు. అతడు యశోదకు తమ్ముడు. శ్రీధాముడనే పుత్రుడూ, నీళ అనే కన్యా అతని సంతానం.

పూర్వం తారకాసురుడితో విష్ణువు యుద్ధం చేసినప్పుడు, ఆ యుద్ధంలో కాలనేమి పుత్రులేడుగురిని అతడు వధించాడు. ఆ ఏడుగురూ పగతీర్చుకునేందుకు కుంభకుడుండే గోవ్రజంలో ఏడు ఆబోతులుగా పుట్టారు. వాళ్ళ ఘోరకృత్యాలు అన్నీ యిన్నీ అని చెప్పడానికి వీలు కాకుండా పోయాయి. మందలలో పడి దొరికిన ఆవులనూ, ఎద్దులనూ చంపటం, ఎదిరించవచ్చిన గోపాలకులను పొడిచి కాళ్ళతో మట్టగించటం, గోడలను కొమ్ములతో కుమ్మి పడకొట్టి కొట్టాలలో వున్న పశువులను కూడా హతమార్చటం, వాళ్ళ నిత్యకృత్యమైపోయింది. ఆబోతుల ఘోర కృత్యాలు రోజురోజుకూ మితిమించిపోయాయి.

కుంభకుడు ఆబోతులను పట్టుకొనటానికి ఎన్నో ప్రయత్నాలు చేశాడు. ఎందరెందరో యోధులూ, మల్లులూ వెళ్ళి, వాటిని హతమార్చబోయి తామే హతులయ్యారు. కొన్నాళ్ళకు యీ ఆబోతులు కుంభకవ్రజంలో యిక తాము నాశనం చేసేందుకేమీ మిగలక, విదేహరాజ్యంలోని గ్రామాల మీదికి వెళ్ళి పశువులనూ, మనుషులనూ చంపసాగినై. ఈ ఘోరాలు భరించలేక ప్రజలందరూ మిథిలానగర రాజు వద్దకు వెళ్ళి, ఆయనతో, ''మహారాజా! కుంభకుడి గోవులమందలో పుట్టిన ఏడు ఆబోతులు, మా మందలనూ, పచ్చని పైరు పొలాలనూ సర్వనాశనం చేస్తున్నవి. వాటిని చంపి మీరు మమ్మల్ని కాపాడకపోతే, మేమంతా మరో రాజ్యం వలసపోక తప్పదు,'' అని విన్నవించుకున్నారు.





# సాహస కార్యం

ఒకానొకప్పుడు, హేమగిరి గ్రామానికి బందిపోట్లబెడద ఎక్కువయింది. వాళ్ళు పదిమంది మాత్రమే. అయితే, ఉన్నట్టుండి గ్రామం మీద హఠాత్తుగా దాడిచేసి ధన, ధాన్య, కనక, వాహనాలనే కాక—వచ్చి నప్పుడల్లా ఒకరిద్దరు యువతులనూ, బాలురనూ ఎత్తుకుపోతూండేవాళ్ళు. ఇందువల్ల, ఊళ్ళోవాళ్ళందరూ ప్రాణా లరచేతబెట్టుకుని జీవిస్తూండేవాళ్ళు.

కొన్నాళ్ళకు, ఆ జీవితం మీద రోతపుట్టి, ఊళ్ళోవాళ్ళందరూ ఊరువదిలిపోదలచి, అనువైన ప్రదేశం వెదకమని, వీరసేను డనేవాణ్ణి పంపారు.

వాడు బయలుదేరి ముందుగా, పొరుగున వున్న ఒక గ్రామం చేరి, గ్రామాధి కారిని కలుసుకుని సంగతంతా చెప్పాడు.

గ్రామాధికారి, వీరసేనుడు చెప్పిన దంతా విని, "మీ ఊరువాళ్ళు కొత్త ప్రదేశానికి పోయి, అక్కడ స్థిరపడితే మాత్రం, బందిపోట్లు ఆ ఊరి మీదికివచ్చి పడరని నమ్మకమేమిటి? బలహీనుణ్ణి, బలవంతుడెప్పుడూ తరిమి, తరిమి వేధిస్తూనే వుంటాడు. మీ ఊరివాళ్ళంతా ఏకమైతే, పదిమంది బందిపోట్లను చితక బాదడం ఏమంత కష్టమైనపని! మీ బలహీనతను కనిపెట్టే, వాళ్ళు మీ ఊరి మీద దాడి చేస్తున్నారు. వాళ్ళు, మా గ్రామం పొలిమేరల చాయలకు కూడా రాభయపడతారు," అన్నాడు.

"అయ్యా, ఊరి వాళ్ళందర్నీ ఒక్క తాటి మీద నిలపడం, మాకు చేతకావడం లేదు. బందిపోట్లను ఎదిరించాలని మాకూ వుంది. కాని, పిల్లిమెడలో ఎవరు గంట కడతారు?" అన్నాడు వీరసేనుడు.

గ్రామాధికారి కొంచెంసేపు ఆలోచించి, "మా గ్రామంలో ప్రబోధానందు డనే

జొన్నలగడ్డ రామలక్ష్మి



యోగి వుంటున్నాడు. ఆయన కారణం గానే, మా గ్రామస్థులందరికీ బందిపోట్ల నెదిరించే ధైర్యం వచ్చింది. నీవు, మీ ఊరి సమస్య గురించి, ఆయనకు చెప్పు కుంటే—ఏదో ఉపాయం దొరక్కపోదు." అని వీరసేనుడికి సలహాయిచ్చాడు.

వీరసేనుడు, యోగి ప్రబోధానందుణ్ణి దర్శించి, తమ సమస్య గురించి చెప్పు కున్నాడు. యోగి, అతడితో, "నేను, నీతో పాటు మీ ఊరికి వచ్చి, అక్కడ కొన్నాళ్ళుండి, మీ అందరినీ బందిపోట్ల నెదిరించేశక్తివంతులుచేస్తాను."అన్నాడు.

ఆ తర్వాత వీరసేనుడూ, యోగీ హేమ గిరి గ్రామం చేరుకున్నారు.

వీరసేనుడు, ఒక యోగిని వెంట బెట్టుకువచ్చాడనీ, ఆయన మహామహిమ లున్నవాడనీ, ఎవరో ఊళ్ళో ప్రచారం చేశారు. ఆ వెంటనే, ఊరివాళ్ళంతా ఒక చోట సమావేశమై, యోగిని ఆహ్వానిం చారు. యోగి వాళ్ళకు, ధైర్యంతో సాధించ లేనిదంటూ లేదని ప్రబోధించాడు.

అప్పుడు గ్రామపెద్ద, ఆయనతో, "స్వామీ, ఈ సంగతి మాకు తెలియంది కాదు. అయితే, మాలో ఎవరికీ కర్రా, కత్తిసాముల్లాంటివి రావు. ఇక బందిపోట్ల నెదిరించేదెలా ?" అన్నాడు.

"ధైర్యం, ఉపాయం వుంటే, ఎలాంటి వాడైనా సాహసకార్యం చేయగలడు. నేను, మిమ్మల్ని ధైర్యవంతులుగా చేస్తాను. బందిపోట్లనెదిరించే ఉపాయాలు కూడా చెబుతాను. ప్రతి రోజూ కొంత సేపు, నే చెప్పేది వింటూండండి." అన్నాడు ప్రబోధానందుడు.

"మీరు, మాకు కర్రసామూ, కత్తిసామూ లాంటి విద్యలైనా నేర్పండి, లేదా ఏవైనా మహిమలు చేయండి. అంతే కాని, ఒట్టి మాటలతో సరిపెట్టకండి," అన్నాడు గ్రామపెద్ద వినయంగా.

"నాకు, నువ్వనే ఆ విద్యలేవీ రావు. నేను మహిమలు చేసి బందిపోట్లను పార దోలలేను. మీరు, నా మాటలు వినండి!

ఒకవేళ నమ్మకం లేకపోతే, మచ్చుకు మీలో ఎవరైనా ముందుకు రండి. ఒక్క రోజులో అతనిచేత సాహసకార్యం చేయించగలను,'' అన్నాడు యోగి.

ఊళ్ళోవాళ్ళందరూ తమలో తాము సంప్రతించుకుని, దుర్బలు డనేవాణ్ణి ఎన్నుకున్నారు. ఈ దుర్బలుడి అసలు పేరేమిటో ఎవరికీ తెలియదు. అందరూ వాణ్ణి దుర్బలుడని పిలిచేవాళ్ళు. వాడు సన్నగా, పీలగా వుంటాడు. వాడికి భార్య మాట వేదవాక్కు. ఆమె మాట విని, తల్లిదండ్రుల నుంచి విడిపోయి వేరు కాపురం పెట్టాడు. వాడికి పిల్లిని చూసినా, ఎలుకను చూసినా భయం. చీమా, దోమ లాంటివి కంటబడితే ఉలిక్కిపడేవాడు. భార్య చెప్పందే మంచినీళ్ళు కూడా ముట్టడు.

''ఒక్క రోజులో, నీచేత సాహసకార్యం చేయిస్తాను. నా దగ్గరకు రా!'' అన్నాడు ప్రబోధానందుడు, దుర్బలుడితో.

దుర్బలుడు ముందుకు వెళ్లబోతూంటే, భార్య వాణ్ణి ఆపి, ''సరే వెళ్ళు! ఆ యోగి ఏం చెప్పినా బుద్ధిగా విని, నా దగ్గిరకు వచ్చెయ్యి: అంతేకాని, ఆయన చెప్పినట్టు మాత్రం చెయ్యకు. నువ్వు ఏదైనా సాహస కార్యానికి పూనుకుంటే మాత్రం, నేనూరుకోను,'' అన్నది.



దుర్బలుడు, ప్రబోధానందుడి దగ్గిరకు వెళ్ళాడు. ఆయన, వాడి చెవిలో, ''నేను చెప్పిన సాహసకార్యం చేస్తే, నీకు ప్రమాదం వుండదు. నా మహిమతో నిన్ను కాపాడుతూంటాను. అందువల్ల, నీకు అంతులేని సంపద సమకూరుతుంది. కీర్తి ప్రతిష్ఠలు లభిస్తాయి. నీ భార్య యిప్పుడు ఒప్పుకోకపోయినా, అప్పుడు సంతోషిస్తుంది. బాగా ఆలోచించుకో! నువ్వు, నా కారణంగా తప్ప, జీవితంలో సాహస కార్యం చెయ్యలేవు. వచ్చిన యీ అవకాశం వదులుకోకు,'' అని చెప్పాడు.

దుర్బలుడు, యోగి చెప్పింది విన్నాడు. యోగి అవే మాటలు ముమ్మారు వాడికి



చెప్పి, ''ఇక నీవు వెళ్ళవచ్చు! రేపు యిక్కడ సమావేశం అయేసరికి, నీచేత సాహసకార్యం పూర్తిచేయించగలను. రేపు త్వరగా నా దగ్గిరకు రా!'' అన్నాడు.

తర్వాత యోగి, అక్కడ వున్నవాళ్ళందర్నీ, మర్నాడు సమావేశానికి రావలసిందిగా చెప్పాడు.

అంతా విన్న దుర్బలుడి భార్య కోపంగా, ''నా చెప్పు చేతల్లో వుంటున్న, నా భర్తను, నాక్కాకుండా చేయాలని, మీరంతా పగ బట్టినట్టున్నది. నేను మాత్రం, మీ ఆటలు సాగనివ్వను. నా భర్తను సాహసకార్యం చేయనివ్వను.'' అని భర్తను వెంటబెట్టుకుని విసురుగా వెళ్ళిపోయింది.

మర్నాడు అందరూ అదేచోట సమావేశమయ్యారు. యోగి, దుర్బలుడి కేసి చూస్తూ, ''దుర్బలా, నిన్న సమావేశం ముగిశాక, ఏదో ఒక సమయంలో, ఒంటరిగా నా దగ్గిరకు వస్తావనుకున్నాను; రాలేదు. నీకు సాహసకార్యం చేయాలని లేదా?'' అని అడిగాడు.

''స్వామీ, ఏదో ఒకటి నిర్ణయించుకోవడంలో ఆలస్యమయింది, మన్నించండి. నాకు సాహసకార్యం చేయాలనే వున్నది,'' అంటూ దుర్బలుడు ముందుకు వచ్చి, యోగికి పాదాభివందనం చేశాడు.

''చూశారా, అన్న మాట నిలబెట్టుకున్నాను!'' అన్నాడు యోగి గ్రామస్థులతో.

అప్పుడు ఊరిపెద్ద, ''స్వామీ, తమరు—ఈనాడీ సమయానికల్లా దుర్బలుడి చేత సాహసకార్యం చేయిస్తామన్నారు. సాహసకార్యం చేయాలా, వద్దా అన్న నిర్ణయం తీసుకునేందుకే, వాడికొక రోజు పట్టింది. ఇక వాడు సాహసకార్యం ఏం చేయగలడు? మీరు అన్న మాట నిలబెట్టుకోలేకపోయారు,'' అన్నాడు.

ఊరివాళ్ళందరూ హేళనగా నవ్వారు, యోగి కేసి చూస్తూ.

ఆ వెంటనే వీరసేనుడు, వాళ్ళతో, ''అలా నవ్వకండి! ఈ యోగీశ్వరుల

వారిచ్చిన సలహాలూ, సూచనల కారణం గానే, మనకు, పొరుగున వున్న అనేక గ్రామాలవాళ్ళు సాహసించి బందిపోట్ల బెడద వదిలించుకున్నారు. అందువల్ల, ఆయనచెప్పేది శ్రద్ధగా వినండి," అన్నాడు.

యోగి కొద్దిసేపు మౌనం వహించి, తర్వాత గంభీరస్వరంతో, "దుర్బలుడు, భార్య నెదిరించి ఏ పనీ చేయలేడని మీరే చెప్పారు. అతడు సాహసకార్యానికి పూనుకోవడం, తన కిష్టం లేదని, అతడి భార్య చెప్పింది. అయినా, యిప్పుడు దుర్బలుడు, తనకు సాహసకార్యం చేయాలని వున్నదన్నాడంటే—దాని అర్థం భార్య నెదిరించాడనే కదా? అంటే, దుర్బలుడు యిప్పటికే, భార్య నెదిరించడమనే సాహసకార్యం చేశాడు. అందువల్ల, నేను అన్నమాట నిలబెట్టుకున్నాను," అన్నాడు.

ఈ మాటలకు, ఈసారి అక్కడ వున్న వాళ్ళలో కొద్దిమంది నవ్వారు. అప్పుడు యోగి, "దుర్బలుణ్ణి చూసి నవ్వే అర్హత, మీకు లేదు. అతను భార్యకు భయపడితే, మీరు బందిపోట్లకు భయపడుతున్నారు. తమ శక్తితో బందిపోట్లను తరిమికొట్టిన, మీ పొరుగు గ్రామాలవాళ్ళకే, దుర్బలుణ్ణి చూసి నవ్వే అర్హత వున్నది," అన్నాడు.

ఊరివాళ్ళందరూ, తమ చేతకానితనానికి సిగ్గుపడి తలలు వంచుకున్నారు. ఊరిపెద్ద, యోగి పాదాలకు నమస్కరించి, "స్వామీ, భార్య అంటేనే కాక, పిల్లినీ; ఎలుకనూ చూసి కూడా భయపడే దుర్బలుడిలో, సాహసం అనే బీజం నాటి, మా ఊరివాళ్ళందరి కళ్ళూ తెరిపించారు. ఈసారి బందిపోట్లు ఊరి మీదికి వచ్చినప్పుడు, అందరం ఐక్యంగా ప్రాణాలకు తెగించయినా, వాళ్ళతో పోరి పారదోలగలం," అన్నాడు.

ప్రబోధానందుడు చాలా సంతోషించి, వీరసేనుణ్ణీ, ఊరివాళ్ళనూ దీవించి వెళ్ళిపోయాడు. ఆ తర్వాత కొన్నాళ్ళకు ఊరు దోచవచ్చిన బందిపోట్లు, సాహసికులైన ప్రజలు తిరగబడి చావుదెబ్బలు కొట్టగా, మరెన్నడూ అటు కేసి రాలేదు.



# తూర్పూ లేదు—అష్టమీ లేదు!

ఒకానొక గ్రామంలో దుష్టులుగా, దొంగలుగా పేరుమోసిన నలుగురు యువకులు, ఒక పేదరైతు మేకపోతును దొంగిలించి, గ్రామం వెలుపల చెరువుగట్టుపైనవున్న మర్రిచెట్టు కింద చంపి, వండుకుతినేశారు.

ఈ సంగతి తెలిసిన పేదరైతు, తనే గ్రామంలో న్యాయం జరగదని, పట్టణానికి పోయి, రాజు దగ్గిర మొరబెట్టుకుని, తనకు న్యాయం కలిగించమన్నాడు.

రాజు, నలుగురు యువకులనూ పట్టి తెప్పించి, విచారణ ప్రారంభించాడు.

ఆ నలుగురిలో రాముడనేవాడు, రాజుతో, "ఈ రైతుకు మేకపోతే లేదు. ఇక దాన్ని దొంగిలించడమేమిటి?" అన్నాడు ధైర్యంగా.

అది విన్న రైతు కోపంగా, "ఒరేయ్, రాముడూ! చెరువుగట్టుపైవున్న మర్రిచెట్టు కింద మీరు చంపి తిన్న మేకపోతు, ఎవరిదిరా?" అని అడిగాడు.

ఆ నలుగురిలో మరొకడు నవ్వి, "మహారాజా, అసలు మా గ్రామంలో చెరువే లేదు. మర్రిచెట్టు అంతకన్నా లేదు," అన్నాడు.

"అన్యాయం! అన్యాయం! చెరువు వున్నది, మహారాజా! చెరువుకు సరిగ్గా తూర్పు దిక్కున, మొన్న అష్టమినాడు, వీళ్ళు నా మేకపోతును చంపి తిన్నారు," అన్నాడు పేదరైతు.

దానికి యువకుల్లో ఇంకొకడు, "మా గ్రామానికి తూర్పు దిక్కు లేనేలేదు, మహారాజా! అష్టమి తిథి, మా గ్రామానికి రానేరాదు. ఇక, అష్టమినాడు మేకపోతును చంపి తినడమేమిటి? అంతా అబద్ధం!" అన్నాడు.

దానితో రాజుకు నిజం తెలిసిపోయింది. ఆయన రైతుకు నష్టపరిహారం యిప్పించి, నలుగురు యువకులకూ కఠిన శిక్ష విధించాడు.

—కొప్పరపు నాగేశ్వరరావు







# జోస్యగాడు

పర్షియాదేశంలో ఒక పేదవాడుండేవాడు. అతను నగరంలోని వీధుల వెంట తిరిగి చిల్లర వ్యాపారం చేసుకుని జీవితం నెట్టుకొస్తూ ఉండేవాడు.

ఒకనాడు ఈ పేదవాడి భార్య, స్నానానికని స్నానశాలకు వెళ్ళింది. అదే సమయంలో అక్కడికి మరొక స్త్రీ వచ్చి, తాను స్నానం చెయ్యాలనీ, తన కోసం స్నానశాలను ఖాళీ చేయమనీ స్నానశాలవాణ్ణి అడిగింది. వాడు మిగతా స్త్రీలనందరినీ బయటికి వెళ్ళమన్నాడు.

ఈ ఉత్తరువు విని పేదవాడి భార్యకు రోషం వచ్చి: "ఎవరీ మహారాణి? ఈమె కోసం మమ్మల్నందరినీ బయటికి తరిమేస్తున్నావు!" అని అడిగింది.

స్నానశాలవాడు, "ఆవిడ ఎవరనుకున్నావు? రాజుగారి ప్రధాన జ్యోతిష్కుడి భార్య!" అన్నాడు.

పేదవాడి భార్య చిరాకుతో ఇంటికి తిరిగి వచ్చి, తన భర్తతో, "నువు బొత్తిగా ఊరూ పేరూ లేనివాడివై పోయావేమిటి? జ్యోతిష్కుడివన్నా కారాదా? నన్ను నలుగురూ కాస్త మర్యాదగా చూస్తారు," అన్నది.

"నేను జాతకచక్రాలు వెయ్యలేను, గ్రహచారాలు గుణించలేను, జ్యోతిష్కుడు కావటం నావల్ల అవుతుందా?" అన్నాడు పేదవాడు.

"నా కదంతా తెలీదు. నువు జ్యోతిష్కుడివి కాకపోయావే, మన పెళ్ళి రద్దు చేసి నా దారిన నేను పుట్టింటికి వెళ్ళిపోతాను," అన్నది భార్య.

పేదవాడు చేసేదిలేక ఒక పంచాంగం కట్టా, పాచికలూ తీసుకుని స్నానశాల వెలుపల జోస్యం చెప్పటానికి కూర్చున్నాడు.

పర్షియా జానపద కథ



దాసీదానికి, తానా ఉంగరం ఎక్కడ భద్రం చేసినదీ చచ్చినా జ్ఞాపకం రాలేదు.

దాని కంగారు చూసి రాజకుమార్తె, "ఆ ఉంగరం ఈ క్షణం ఇవ్వక పోయావో, నీ ప్రాణాలు తీస్తాను," అంటూ మీదికి వచ్చింది.

దాసీది భయపడి స్నానశాల వెలుపలకు పరిగెత్తుకు వచ్చింది. దానికి జ్యోతిష్కుడు కనిపించాడు.

"బాబ్బాబు! రాజకుమార్తె ఉంగరం ఎక్కడుందో శాస్త్ర చెప్పు. లేకపోతే నా ప్రాణాలు దక్కవు." అన్నది దాసీది పేదవాడితో.

ఇదే సమయంలో రాజకుమార్తె స్నానశాలలో స్నానం చేస్తున్నది. ఆమె స్నానం ప్రారంభించబోతూ తన చేతి ఉంగరం తీసి దాసీదాని కిచ్చి, "దీన్ని భద్రంగా వుంచు, స్నానం అయాక తీసుకుంటాను." అని చెప్పింది.

ఆ ఉంగరాన్ని ఎక్కడ ఉంచటానికీ పాలుపోక, దాసీది దాపులనున్న చలువ రాతి గోడలో ఒక చిన్న రంధ్రం ఉంటే, అందులో ఉంగరాన్ని దూర్చి, గుర్తుగా అక్కడ పడివున్న ఒక వెంట్రుకల తుట్టె ఆ రంధ్రంలో గుచ్చింది.

కాని రాజకుమార్తె స్నానం ముగించి, "ఏదే నా ఉంగరం?" అని అడిగేసరికి

పేదవాడికి ఏం చెయ్యాలో, ఏమనాలో తెలియలేదు. అతను దాసీ కేసి చూశాడు, పంచాంగం తిప్పాడు, పాచికలు వేసి వాటిని పరీక్షగా చూశాడు.

దాసీది నెత్తిమీదిగా వేసుకున్న బట్టలో ఒక చిరుగున్నది. దానిలో నుంచి వెంట్రుకలు బయటికి చూస్తున్నాయి. ఇది గమనించిన పేదవాడు, ఏదయితే అదవుతుం దనుకుని, "అమ్మాయీ, నాకొక చిన్న కంత కనిపిస్తున్నది. అందులో వెంట్రుకలు కనబడుతున్నాయి!" అన్నాడు.

వెంటనే దాసీకి తాను ఉంగరం దాచిన స్థలం గుర్తుకొచ్చింది. ఆమె గబగబా స్నానశాలలోకి పరిగెత్తుకుపోయి, ఉంగ

రాన్ని తీసి రాజకుమార్తెకిస్తూ, బయట ఉన్న జ్యోతిష్కుడు ఇవాళ తన పరువు దక్కించాడని చెప్పింది.

రాజకుమార్తె అది చెప్పిన మాటలకు అబ్బురపడి, ఇంటికి వెళ్ళి తన తండ్రికి ఈ సంఘటన అంతా చెప్పింది.

రాజుగారు ఈ కొత్త జ్యోతిష్కుణ్ణి రావించి, దుశ్శాలువలు కప్పి, తన ఆస్థానంలో కొలువిచ్చాడు.

కాని, త్వరలోనే జ్యోతిష్కుడికి అగ్ని పరీక్ష తగిలింది. ఎవరో దొంగలు ఖజానాలో చోరీ చేశారు. అమూల్యమైన వస్తువులు పోయాయి. దొంగలెవరో జోస్యం చెప్పమని రాజుగారు కొత్త జ్యోతిష్కుణ్ణి ఆజ్ఞాపించాడు.

జ్యోతిష్కుడికి మతి పోయినట్టయింది. ఏమిచేయడానికీ తోచక కొంతసేపు తటపటాయించి, ఎందుకైనా మంచిదని అతను రాజుగారిని నలభైరోజులు గడువడిగాడు. అందుకు రాజు సరేనన్నాడు.

జ్యోతిష్కుడు ఇంటికొచ్చి తన భార్యతో, "అంతా అయిపోయింది. జ్యోతిష్కుడు కమ్మని నా ప్రాణాలు తీశావు. రాజుగారి ఖజానాలో చోరీ జరిగింది. దొంగలను కనుక్కోవటానికి నలభై రోజులు గడువడిగాను. గడువు తీరేరోజున మనం పారిపోవటం తప్ప మార్గం లేదు," అన్నాడు.

లెక్క తెలియగలందులకు జ్యోతిష్కుడి భార్య నలభై ఖర్జూరాలను ఎంచి





ఒక జాడీలో వేసి, "ప్రతి సాయంకాలమూ ఒక్కొక్క ఖర్జూరం తినటానికి ఇస్తాను. జాడీ ఖాళీ అయిన రాత్రి పారిపోదాం," అని చెప్పింది.

రాజుగారి ఖజానా దోచిన దొంగల జట్టులో సరిగ్గా నలభైమందే ఉన్నారు. జ్యోతిష్కుడు తమను పట్టి ఇవ్వటానికి నియోగించబడ్డట్టు వాళ్ళకు తెలిసింది. ఆ సాయంకాలంచీకటిపడేవేళకు దొంగలు తమలో ఒకణ్ణి జ్యోతిష్కుడి ఇంటికి పంపి, లోపల జరిగే సంభాషణ విని రమ్మన్నారు.

దొంగ, చాటున పొంచి వింటూండగా జ్యోతిష్కుడి భార్య జాడీ తెచ్చి, "ఒకటీ," అంటూ తన భర్తకు ఒక ఖర్జూరం ఇచ్చింది.

"మిగిలినవి ముప్పైతొమ్మిదీ!" అన్నాడు జ్యోతిష్కుడు.

దొంగ గాభరాపడుతూ వెళ్ళి మిగిలిన దొంగలతో, "జ్యోతిష్కుడు మన రహస్యం కనిపెట్టేశాడు. నేను చాటున ఉన్నా ఆయన నన్ను తెలుసుకుని, 'ఒకటీ—మిగిలినవి ముప్పైతొమ్మిదీ!' అన్నాడు," అని చెప్పాడు.

వాడిమాట మిగిలినవాళ్ళు నమ్మక, మర్నాడు చీకటిపడేవేళ ఇంకో దొంగను జ్యోతిష్కుడింటికి పంపారు. లోపల జ్యోతిష్కుడు, "రెండూ! ఇంకా ఉన్నవి ముప్ఫయ్యెనిమిదీ!" అనటం వాడికి వినబడింది.

ఇలా ముప్పైతొమ్మిది రోజులపాటు ముప్పైతొమ్మిదిమంది దొంగలూ లెక్క విన్నారు. వాళ్ళకిక ఎలాటి అనుమానమూ మిగలలేదు. జ్యోతిష్కుడికి తమ అచూకీ తెలిసిందనే, వాళ్ళు అనుకున్నారు.

నలభయ్యో రోజు దొంగల నాయకుడే వచ్చి పొంచి విన్నాడు.

లోపల జ్యోతిష్కుడికి అఖరు ఖర్జూరం ఇస్తూ, "ఇదే అఖరుది! చూశావా? ఇది లోగడ వాటన్నిటికన్నా చాలా పెద్దది!" అన్నది భార్య.

దొంగల నాయకుడికి కాళ్ళు చల్లబడ్డాయి. వాడు చప్పున లోపలికి వచ్చి, జ్యోతిష్కుడి కాళ్ళపైన పడి, "మమ్మల్ని రాజుగారికి పట్టివ్వకండి, బాబోయ్! దొంగిలించిన సొమ్మంతా ఇచ్చేస్తాను. మీకు బహుమానం కూడా ఇచ్చేస్తాను. మా రహస్యం మటుకు రాజుగారికి చెప్పొద్దు! మా పీకలు తెగిపోతాయి!" అని మొత్తుకున్నాడు.

"అలాగే కానీ!" అన్నాడు జ్యోతిష్కుడు తొణక్కుండా.

ఆ రాత్రే దొంగలు తాము ఖజానా నుంచి దోచినదంతా తెచ్చి జ్యోతిష్కుడికి ఇచ్చి, లంచంగా బోలెడంత డబ్బు కూడా ఇచ్చుకున్నారు.

జ్యోతిష్కుడికి పోయిన ప్రాణం తిరిగి వచ్చినట్టయింది. ఆయన మర్నాడు రాజుగారికి పోయిన సొమ్మంతా అప్పగించాడు. జ్యోతిష్కుడి సామర్థ్యానికి దిగ్భ్రమచెంది రాజుగారు అతనికి సత్కారాలు చేశాడు.

రాజుగారు తనను మెచ్చుకుని సత్కారాలు చేస్తున్నకొద్దీ జ్యోతిష్కుడికి ఆరాటం జాస్తి కాసాగింది. ఇలా ఎంతకాలం జరుగుతుంది? ఎప్పుడో తాను దొరికిపోక తప్పదు. ఆనాడు రాజు తన తల తీయించకా మానడు. ఇంతవరకూ అదృష్టం తనను నెట్టుకొచ్చింది. కాని, అదృష్టదేవత చాలా చంచలమైనది.

ఈ బెడద నుంచి బయటపడటమెలాగా అని జ్యోతిష్కుడు ఆలోచిస్తూ స్నానం



చేస్తూండగా, అతని కొక గొప్ప ఆలోచన తట్టింది. తనకు పిచ్చి ఎత్తిందని తోస్తే, రాజు తనను కొలువు నుంచి తీసేస్తాడు. ఆ తరవాత తనకు మెడ మీద కత్తిలాగా ఈ సమస్య ఉండదు.

ఈ ఆలోచన తట్టినదే తడవుగా జ్యోతిష్కుడు తడిగుడ్డలతోనే రాజభవనానికి పరిగెత్తాడు. తిన్నగా రాజుగారు అభ్యంతర సభ తీరి ఉన్నచోటికి వెళ్ళి, రాజుగారిని ఆసనం మీది నుంచి ఎత్తుకుని బయటికి పరుగుతీశాడు.

ఆ మరుక్షణమే పైనున్న దూలం విరిగి రాజుగారు కూర్చుండిన ఆసనం మీద దభీమంటూ పడింది. ఆసనం పూర్తిగా ధ్వంసమయింది.

తన ఆస్థాన జ్యోతిష్కుడి అసభ్య ప్రవర్తనకు ఆగ్రహావేశం తెచ్చుకుంటున్న రాజు ఇది చూడగానే, "ఆహా! నువు సామాన్య జ్యోతిష్కుడివి కావు, త్రికాల వేదివి! నాకు రానున్న కీడు ముందే గ్రహించి, నా ప్రాణం కాపాడటానికి స్నానం చేస్తూ, చేస్తూ వచ్చావు! నీబోటి అప్పుడు మరెవడుంటాడు! ఏమిస్తే నీరుణం తీరుతుంది!" అన్నాడు.

రాజుగారితో రహస్యాలోచనలు చేస్తూ ఉండిన మంత్రులందరూ జ్యోతిష్కుడి పాదాల మీద పడ్డారు.

రాజుగారు పరమానందం చెంది, జ్యోతిష్కుడికి గొప్ప సన్మానం చేసి, అంతులేని బహుమానాలిచ్చి, పాత ప్రధాన జ్యోతిష్కుణ్ణి ఆ పదవి నుంచి తొలగించి, అతని స్థానంలో ఈ జ్యోతిష్కుణ్ణి నియమించాడు.

మర్నాడు జ్యోతిష్కుడి భార్య స్నానశాలకు వెళ్ళింది. ఆ సమయంలో అక్కడ పాత ప్రధాన జ్యోతిష్కుడి భార్య స్నానం చేస్తున్నది.

జ్యోతిష్కుడి భార్య స్నానశాలవాడితో, "ఆ మనిషిని పంపించు. నేను స్నానం చెయ్యాలి!" అన్నది.

"చిత్తం, చిత్తం!" అన్నాడు స్నానశాలవాడు.



## పొడుగాటి కీటకం

ఇండొనేసియాలో కనిపించే గొల్లభామవంటి కొయ్యకీటకమే ప్రపంచంలోకెల్లా పొడవైన కీటకంగా భావించబడుతున్నది. తల నుంచి, తోక వరకు దీని పొడవు దాదాపు 13 అంగుళాలు!

## విషం చిమ్మే పాము!

ఉపద్రవానికి గురయినప్పుడు, కట్లత్రాచు పాము నోటి నుంచి రెండు విషజ్వాలలు విరజిమ్ముతుంది. తనను వేధించే వాళ్ళ కళ్ళ కేసి, కోరల నుంచి విరజిమ్మబడే ఈ విషజ్వాలలు దాదాపు 8 అడుగుల పొడవు ఉంటాయి!





## తవ్వడంలో మొనగాడు!

ప్రపంచంలో అన్ని జంతువులకన్నా, ఐరోపా—ఆసియాఖండ మిశ్రమజాతికి చెందిన అడవి ఎలుక, భూమిలో అతి వేగంగా బొరియలు తవ్వగలదు. ఈ ఎలుక ఇరవై నిమిషాలలో—తన శరీరం బరువుకు యాభై రెట్ల బరువు మట్టిని తవ్వి పైకెత్తగలదు!

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1988 మార్చి నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



Mohan D. Desai

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ జనవరి నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### నవంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: నీటిబుడగ నిలుస్తుందా! రెండవ ఫోటో: ప్రతిబింబం పిలుస్తుందా!

పంపినవారు: అమ్ముల బదరీనారాయణ, చిన్నబావిడి వీధి, రాజంపేట, కడప జిల్లా, (ఆం.ప్ర.)

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 30-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# Join the dots . . . and make Jumbo come alive!

## The G-r-r-reat taste adventure

Cadbury's

**Wildlife BAR**




Now, capture the taste of Cadbury's Dairy Milk with Cadbury's Wildlife Bars.
Each bar with fun animal shapes on it – and in a range of twelve exciting wildlife wrappers.

Cadbury's Wildlife Bars.
Track them down!


A Super treat in every sweet!
SUPER SIZE!
SUPER TASTE!
nutrine
SuperStar
Premium toffees
nutrine
SuperStar
DELITE


TWIN TREAT


TWIN TREAT
DELITE
TOP CREAM
Heavenly
delights


nutrine
భారత దేశంలో అత్యధికంగా అమ్మబడే మిఠాయిలు
న్యూట్రిన్ కన్ఫెక్షనరి కంపెని ప్రై. లిమిటెడ్, చిత్తూరు, ఆంధ్రప్రదేశ్
CLARION/NC/8636